శ్రీ పూర్ణప్రజ్ఞ గ్రంథమాల - ద్వితీయకుసుమము

శ్రీ హయగ్రీవాయనమః

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

ఇది

శ్రీ భాసమహాకవి సంస్కృతనాటిక కాంధ్రానువాదము

రచయిత:

కవిశేఖర మధ్వశ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

(గుంటూరు హిందూకళాశాల సంస్కృతాధ్యాపకులు)

—: ప్రకాశకులు :—

వేంకట్రామ అండ్ కో.,

ఎద్యుకేషనల్ పబ్లిషర్సు,

బెజవాడ - మద్రాసు

1947



[వెల 1-0-0

శ్రీహయగ్రీవాయనమః

# విజ్ఞప్తి

(ద్వితీయ ముద్రణమునకు)

తెనాలితాలూకామూల్పూరువాస్తవ్యుఁడు, భూస్వామి ఉదారుఁడు, వృద్ధికాముఁడు నగుమద్భాగినేయుఁడుచిరంజీవి శ్రీ మానూరు వేంకటరమణారావు మద్గ్రంథంబులలో నొక్కదానిని ముద్రింప ముచ్చటపడి సాదరంబుగా నా కొసంగినసద్ద్రవ్యము తో నే నీనాటికను 1947 సంవత్సరము మా పూర్ణప్రజ్ఞగ్రంథ మాలలో ద్వితీయ కుసుమముగాఁ దొలుసారి ప్రకటించితిని. భాసమహాకవి యందలి భక్తిచేతనేమి మద్గ్రంథమునందలి గుణలేశముచేతనేమి యనుపదనే యీనాటికను శ్రీఆంధ్ర విశ్వ విద్యాలయమువారు 1950 వ సంవత్సరమునకును, శ్రీమద్రాసు యూనివర్సిటీవారు 1951 వ సంత్సరమునకును ఇంటర్ మీడియేటు పరీక్షకుఁ బాఠ్యగ్రంథముగా నిర్ణయించి ద్వితీయ ముద్రణావకాశమును వెంటనే కలిగించి మా గ్రంథ మాలను బ్రోత్సహించినందులకు ఉభయ విశ్వవిద్యాలయాధి కారులకును మత్కృతజ్ఞతా పూర్వకాభివందనముల నర్పించు చున్నాను.

నాయందభిమానముంచి యేతన్నాటికాపునర్ముద్రణము నకు రు 650 ఆఱువందలయేఁబది రూప్యముల నాకు విరాళ ముగా నొసఁగిన శ్రీ గుంటూరు రామచంద్రపురాగ్రహార సభవారికి నాధన్యవాదములు.

పై విధమున నాకును మద్గ్రంథమాలకును సర్వవిధములఁ దోడ్పడుచున్న విద్యాధికారులకు, గ్రంథ ప్రకాశకులకు, ఉదారులకు, అభిమానులకు, సహాయులకు, మిత్రులకు నా యభివందనములు.

ఇట్లు

గుంటూరు
2—6—48

గ్రంథకర్త
పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

శ్రీహయగ్రీవాయ నమః

# విజ్ఞప్తి

మామిత్రులగు శ్రీమాన్ కోమాండూరు కృష్ణమాచార్యుల వారిపీఠికయే భాస, తన్నాటక ప్రాశస్త్యమును బహుభంగుల విశదీకరించుటం జేసి నాభారము చాలవఱకుఁ దగ్గినను సముదాచారానుసారము రెండువాక్యముల వ్రాయుచున్నాను.

శ్రీమహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రిగారి యముద్రిత గ్రంథాన్వేషణ కృషిఫలితముగా లభించిన భాసనాటకచక్రమును గాంచుభాగ్యము నాకు రమారమి యిరువదియైదు వత్సరములకుఁ బూర్వము గలిగినది. అప్పటి తన్నాటకాలోకన జనితానందమే నాకు 'ప్రతిమా, ప్రతిజ్ఞాయౌగంధరాయణ, చారుదత్త, దూతవాక్య, దూతఘటోత్కచ' నాటకాంధ్రీకరణములకు హేతువయ్యెను. ఉత్సాహము కలిగినప్పుడు గ్రంథములు వ్రాయుటయేగాని వానిఁ బ్రకటించుటయందు నా కంతగా దృష్టియుండెడిదిగాదు. కనుకనే కావ్యాలోక, శతలక్షణ్యాది గ్రంథము లెన్నియో మాతృకారూపమున నింటనే యున్నవి. ఇప్పటికేని కొందఱుమిత్రుల ప్రోత్సాహముతో నెలకొల్పఁబడిన మా పూర్ణప్రజ్ఞ గ్రంథమాలలో ఈ ప్రతిజ్ఞా యౌగంధరాయణమును (నాటికను) ద్వితీయ కుసుమముగాఁ బ్రకటింపఁ గలిగినందులకు సంతసించుచున్నాను. ఆదరపూర్వకముగాఁ బీఠికవ్రాసియిచ్చిన యస్మత్ప్రియ మిత్రులకు ధన్యవాదములు. మా గ్రంథమాలయందుఁ బ్రత్యేకాభిమానముఁ జూపుచున్న మిత్రులకును, ప్రకాశకులకును, శ్రీ చంద్రికా ముద్రాలయాధిపతులకును నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఇట్లు, గ్రంథకర్త

పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు.

# పీఠిక

ప్రథితయశసాం భాససౌమిల్ల కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః.

సూత్రధార కృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ.

పైనుదాహరింపఁబడిన కాళిదాసబాణమహాకవుల వాక్యముల వలన భాసునిప్రతిభావిశేష మూహింప వలసినదే గాని వ్రాయ నలవి గాదు. కవితాప్రపంచమున కవికులగురుండును, గద్యరచనమున నిరవద్య విద్యాచణుఁడగుబాణుఁడును భాసునియందు సమాన ప్రతిపత్తి గల్గి యుండుట గమనింపఁదగిన విషయము.

1910 యవ సంవత్సరప్రాంతమున మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రిలవా రీనాటకములను విద్వల్లోకమునకు వెలిఁబుచ్చిరి. అది మొదలుగా భాసకవిని గూర్చియు తత్కృతనాటక త్రయోదశిని గూర్చియు వాదప్రతివాదములు ప్రబలియుండుట పండితులెఱింగినదే. నాటకములు మిక్కిలి సంగ్రహముగా నుండుటవలనను సౌలభ్యాతిశయముగలిగి యుండుటవలనను పూర్వకవికృతములును విస్తృతములు నగునాటకములను రంగస్థలోచితముగా మలయాళమునందలి భరతపుత్రులొత్తి వ్రాసికొనియుందురనియు తజ్జ్ఞులభిప్రాయపడుచున్నారు. ఈ పూర్వకవిభాసుఁడే కానోపు. రచన ననుసరించియు శైలియందలి యార్షభావమునుబట్టియు నీ నాటకములు తప్పక కాళిదాసునకుఁ బూర్వమునఁగల రూపకరంగమును సూచించు చున్నవనుట నిర్వివాదము.

శతానీకపుత్త్రుండగు నుదయనుఁడు క్రీ. వె. 6 వ శతాబ్దము నను ఐదవ శతాబ్దప్రారంభమునను వత్సవిషయము నేలిన వత్సరాజు. ఆకాలముననే భాసుఁడును గలఁడని యొకయభిప్రాయము. మృచ్ఛకటికమునఁగల పాలకుఁడును, మాగధుఁడగు దర్శకుఁడును, ఉజ్జయినీనాథుఁడగు ప్రద్యోతుఁడును సమకాలికులు. చారుదత్తనాటకమే

మృచ్ఛకటికముగాఁ బరిణమించినది. శూద్రకుఁడు క్రీ. శ. 2 వ శతా
బ్దమునఁ గలఁడని నిరూపించిరి. పాణిని క్రీ. పూ. 6 లేక 7 వ శతా
బ్దప్రాంతములఁ గలఁడని ఐతిహాసికసమ్మతి. భాసుని అపాణినీయ ప్రయో
గముల ననుసరించియు, ఆర్షకావ్య మగు శ్రీమద్రామాయణముతోఁ
దులఁదూఁగఁగల శైలీసంవాదము ననుసరించియు, భాసుని కాలము
క్రీస్తునకుఁ బూర్వము 4 లేక 5 వ శతాబ్దప్రాంతము గానోపును.

ఈనాటకములందు సౌలభ్య మనునది ప్రథమగుణము. ఔత్తర
కాలికనాటకరంగమునఁ బ్రదర్శనయోగ్యము లయ్యును శబ్దార్థవైచి
త్ర్యము గలిగి ప్రాచ్యపాశ్చాత్యఖండములందును నగ్రస్థానము
వహించిన కాళిదాసనాటకములు మొదలుగా ప్రదర్శనమున కను
కూలములు గానివియును శబ్దార్థాడంబరము గలిగి సుప్రసిద్ధ పాణినీయ
ప్రయోగోదాహరణభూతము లగు భవభూతి, మురారి ప్రస్థానముల
వఱకును గల శైలీభేదములు భాసునియం దించుకయును గానరావు.
ఇంతియ గాక రంగస్థలమున నత్యంతరమణీయములును యామమాత్ర
కాలమునఁ బ్రదర్శనార్హములు నగుట యీనాటకములందుఁ గల
సామాన్యగుణసంపద. కావున దృశ్యకావ్యము లనుమాట యీనాటక
ములకే చెల్లినది. ఉత్తరనాటకరంగమున మృచ్ఛకటిక యొక్కటి
దక్క తుల్యానుభావము గలనాటకము మచ్చునకైన దొరకదు.
పాత్రములగమనిక సినిమారంగమునందువలె నతిశీఘ్ర మగుటయు
రసస్ఫూర్తి గల్గి యుండియును పదాడంబరము లేక చర్వణానుకూల
మగురీతి నొప్పారుటయును ఈరూపకములందుఁ గలయనన్యసామాన్య
ధర్మము. కావున నతిప్రాచీనము లయ్యును బ్రకృతరంగమున కవి
యెంతయు ననుకూలము లగుచున్నవి. "ఉదయనకథాకోవిదగ్రామ
వృద్ధాన్" అను మహాకవిపద్ధతి కనుగుణముగా నీనాటకములం దితి
హాసవృత్తము లగు రామభారతకథలే గాక స్వప్నవాసవదత్తాప్రతిజ్ఞా
యౌగంధరాయణములం దుదయనకథయుఁ గ్రోడీకరింపఁబడినది.
ఆధునికనాటకమందలి పిచ్చివానిపాత్ర యౌగంధరాయణపాత్ర
ననుసరించియే వ్రాయఁబడినది. మహావీరచరిత్రమునకు నుత్తరరామ

చరిత్రమునకుఁ గలసంబంధమే, ప్రతిజ్ఞాయౌగంధరాయణస్వప్నవాసవదత్తలకునుగలదనుట విమర్శకసంవేద్యము; రసములును వీర-(కరుణ విప్రలంభగర్భిత) శృంగారము లుభయమునకును సమానమే. పై యుదాహరణముల ననుసరించి యీనాటకము లుత్తరరూపకకర్తలకెట్లు మార్గదర్శకము లయ్యెనో పండితు లూహింపఁ గలరు.

ఈనాటకములందలి యితివృత్తములు ప్రఖ్యాతోత్పాద్యమిశ్ర భేదములు గల్గి రామభారతభాగవత కథాపీఠముల ననుసరించి స్వోపజ్ఞమగు శైలిభేదముచే నల్లఁబడినవి.

బాలచరితమున శ్రీకృష్ణచేష్టితములును, మధ్యమవ్యాయోగ, పాంచరాత్ర, దూతవాక్య, దూతఘటోత్కచ, కర్ణభారోరుభంగములఁ బాండవకథయు, ప్రతిమాభిషేకముల రామోదంతమును, ప్రతిజ్ఞా స్వప్నముల నుదయనేతివృత్తమును, అవిమారకచారుదత్తముల నుత్పాద్యవస్తువులును కూర్పఁబడి కవియొక్క సర్వంకష ప్రతిభాశాలిత్వమును, సర్వరసప్రపంచచంచుత్వమును వేనోళ్ళఁ జాటుచున్నవి. కాళిదాస భవభూతులందును ఇట్టిచతురశ్రనిర్మాణమార్మికతకలదా? అనియును శంకింప వలసినట్లున్నవి గాదా యీరూపకములు? ఇవి త్రయోదశ సంఖ్యాత్మకములయ్యును రసపూర్ణములే.

ప్రకృతనాటకమునందలి పాత్రౌచిత్యరసపోషణాదికావ్యగుణము మ విస్తరించి వర్ణింపవలయుననిన నుపోద్ఘాతము విస్తరించుటయేగాక ేతకలోకమున కేర్పడుస్వైరభావముల నరికట్టు ప్రయత్నమువంటి గునేమో యని యట్టియుద్యమమునుండి విరమించుచున్నాను.

గ్రంథకర్తలగు మధ్వశ్రీ పూర్ణప్రజ్ఞులు సార్థకనామధేయులు, గాంధ్ర విద్వల్లోకమున కతిపరిచితులు నగుట వారిని పాఠ వలకుఁ బరిచితులనుగా నొనర్ప యత్నించుట కేవల మనుభవపున రుక్తి యగును. అయినను నూతనవిద్యార్థులకుఁ గొంత యెఱింగించు యు యుక్తమే. వీరు బాల్యమునందే శబ్దశాస్త్రనిష్ణాతులై యష్టావ ధాన, శతావధానముల నొనరించి కావ్యనాటకనిర్మాణమున నుభయ

ందును బంచాశదధిక గ్రంథముల రచించిరి. శ్రీరామకళ్యాణ
ఃమప్రయత్న మగినచో వీరి ప్రతిభావిశేషము చాలవఱకును
ౕ యగును. పరిణతదశ నందిన కాదంబరీకవిత యనర్ఘళము
ముద్రితగ్రంథములగు ద్విపదమేఘదూత కైకేయీ సౌశీల్యాదు
ల కదివఱకే సుపరిచితములు. కావ్యాలోక శతలక్షణ్యాద్యనేక
ు లింకను ముద్రణాలయమును జొఱకున్నవి. భాసునిసౌల
యమునకు మెఱుఁగు వెట్టినట్లున్న దీయాంధ్రీకరణము.
ాకన్యాయముగా ఈ క్రింది శ్లోకమున కాంధ్రీకరణమును
వుఁడు.

ాదగ్నిర్జాయతే మథ్యమానాత్ భూమిస్తోయం ఖన్యమానాదదాతి
స్సాహానాం నాస్త్యసాధ్యం నరాణాం మార్గారబ్ధాః సర్వయత్నాః ఫలంతి.

అం-1-శ్లో-18

యుచోఁ గట్టెనుండియు రాలు నిప్పు త్రవ్వుచో నీరొసంగును ధరణి యేని
దసాధ్య ముత్సాహుల కేది కూడఁదటి నొనర్ప ఫలించు యత్నంబు లెల్ల.

శ్రీయాచార్యులవారు నాకుఁ జిరపరిచితు లగుటయే గాక
ను గౌరవపాత్రులు నగుటచే వీరి నామస్మరణము నాహర్ష
ఎన వ్యంగముగా నొనరించియుంటిని.

"స్వాదుకాంబరీరసాస్వాదమునను బూర్ణమగు ప్రజ్ఞ వాయని
లను, శాబ్దికులఁ గావ్యవేత్తల సరసకవుల లాక్షణికులను దలఁతు
ముగ". (I-7 ఆంధ్రహర్షచరిత్రము)

ప్రస్తుతము కీతికామిషమున మరల వీరియుత్కర్షమును బరిమిత
బచరింపఁ గల భాగ్యము నా కొదవించినందులకు కృతికర్తల
ంఁ గృతజ్ఞుఁడను. శ్రియఃపతి వీరి కాయురారోగ్యసంపదల నొసం
ాక యని యభిలషించుచు నింతటితో నాపీఠిక ముగించు
ను.

రు, }
-47. }

కొమాండూరు కృష్ణమాచార్యులు,
Retd.) Lecturer, A. C. College, Guntur.

# ఈనాటికయందువచ్చు పాత్రములు

## పురుషులు

యౌగంధరాయణుడు – వత్సరాజుగారి ప్రధానమంత్రి

సాలకుడు
నిర్ముండకుడు } యౌగంధరాయణుని చారపురుషులు

హంసకుడు – వత్సరాజునకు నిత్యసన్నిహితుడగు పరిచారకుడు

బ్రాహ్మణుడు – యౌగంధరాయణుని మిత్రుడు

కాంచుకీయుడు } మహాసేనమహారాజుగారి యంతఃపుర పరిచారికుఁడగు బాదరాయణుడు

రాజు – } మహాసేన మహారాజు. వాసవదత్త తండ్రియగు ప్రద్యోతుడు

విదూషకుడు – వత్సరాజుగారి ప్రియవయస్యుడు వసంతకుడు

ఉన్మత్తకుడు – పిచ్చివేసముతోనున్న యౌగంధరాయణుడు

శ్రమణకుడు – బౌద్ధసన్యాసివేషముతోనున్న వత్సరాజుమంత్రి

రుమణ్వంతుడు – వత్సరాజ సచివుడు – శ్రమణక వేషధారి

భటుడు – మహాసేన భృత్యుడు

గాత్రసేవకుడు – వాసవదత్తావాహనమగు భద్రవతికి బరిచారకుడు

సాధారణభటులు (ఇరువురు) – మహాసేనుని భటులు.

భరతరోహకుడు – మహాసేనుని ముఖ్యమంత్రి

శాలంకాయనుడు – మహాసేనుని సచివుడు

## స్త్రీలు

విజయ – వత్సరాజగృహమున ద్వారపాలిక (ప్రతీహారి)

దేవి – మహాసేనుని పట్టపురాణియగు అంగారవతి.

---

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము

## ప్రథమాంకము

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్రధారుఁడు—

గీ. సేన మెల్లర కిడు మహాసేనుఁ డధిక
బలుఁడు వాసవదత్తోరుభద్రుఁ డెవుడు
వత్సరాజాభిధానుఁ డవార్యశక్తి
రాజితుం డగుయౌగంధరాయణుండు॥

[నడచి తెరవైపు చూచి] ఆర్యారాలా! ఇటువచ్చెదవా!

[ప్రవేశించి]

నటి:—ఆర్యా! ఏమి సెలవు?

సూత్ర:—నటీ! ఏదే నొక్కదానిం గూర్చి గాన మొనర్పుము. గానమ్ముచే రంగస్థలంబు ప్రసన్న మగుడు మేమును నాటక ప్రయోగంబున కుపక్రమింతుము. నటీ! ఆలోచించుచుంటి వేమి? పాడెదవా?

నటి:—ఆర్యా? బంధుకులంబున నేదో యస్వస్థత వాటిల్లినట్లు నేఁడు కలఁగంటిని. కానఁ గుశల మెఱింగి వచ్చుటకు నెవరినైనఁ బంపఁ గోరెద.

సూత్ర—అట్లే యొనర్చెదను.

గీ. పురుషు నొక్కనిఁ బంపుదుఁ బూవుఁబోఁడి!
అఖిల మెఱఁగినవాని హితాభిలాషి

[ తెరలో ]

సాలకా ! సిద్ధముగా నుంటివా ?

సూత్ర:—

అఖిల మెఱింగినవాని హితాభిలాషి
సదిగో యౌగంధరాయణుఁ డంపునట్లు.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

ఇది స్థాపన.

[పిమ్మట సాలకునితో యౌగంధరాయణుఁడు ప్రవేశించును ]

యౌగంధరాయణుఁడు:—సాలకా ! సిద్ధముగా నుంటివా ?

సాలకుఁడు:—ఆర్యా ! సిద్ధముగా నుంటిని.

యౌగం:—చాల దూరము పోవలయుఁ జుమా.

సాల:—మహత్తరం బగుస్నేహంబుతోఁ గదా యేలినవారికిఁ సేవ చేయుచున్నాను.

యౌగం:—ఔను. అట్టిస్నేహంబుగల బలశాలియేగదా పోఁగలఁడు.— ఏలయన

గీ. ఇట వలయు దుష్కరపుఁజెయ్దు నెపుడు స్నేహ
భరితులందునో సత్కార నిరతులందో
వారిసామర్థ్యమును దైవవశముచేతఁ
& order used & not perfect (P) జెడినఁ జెడు లేక యనుకూలపడినఁ బడును. 3

అల్లని నర్మదానదీతీరసమీపవర్తి యగు వేణువనంబు నంటి మూఁడరణ్యంబులు గలవు. వానిలో నాగవనంబునకు రేపు మహారాజుగారు వెడలుదురు. ఈలోపలనే నీవు శ్రీవారిని సందర్శింప వలయుఁజుమా.

సాల:—ఆర్యా ! మహారాజుగారికి మనవి చేయఁదగు విషయంబుల తోడిలేఖయేగదా నన్నుఁ బోసియకున్నది.

యౌగం:—విజయా !

(ప్రవేశించి)

విజయ:—ఆర్యా! ఏమి సెలవు.

యౌగం:—లేఖను రత్నసూత్రమును ద్వరితమ్ముగాఁ గొనిరమ్ము.

విజయ:—చిత్తము (నిష్క్రమించును.)

యౌగం:—సాలకా! నీవీమార్గము నెన్నఁడైనం జూచియుంటివా?

సాల—లేదు. వినియుంటిని.

యౌగం:—ఇదియు మేధావిలక్షణంబె. ఓయీ! ప్రద్యోతుఁడు వనగజప్రచ్ఛాదితశరీరం బగునీలగజంబు నొకదానిఁ గల్పించి మన ప్రభువుగారిని వంచింపఁ దలంచుచున్నాఁడని నేఁడు విన వచ్చినది. మహారాజుగారిబుద్ధి యీపాటికే మోహముసఁ బడియుండ దనితలంతును. ఆహా! ప్రద్యోతునకు మా వత్సరాజువలన నెంత భయము! దీనివలన నాతని యక్షౌహిణులకు వత్సరాజుసైన్యముతోఁ బోరఁ జాలమి తెల్లమగును. ఏల యన.

చ. బల మధికమ్మె కాని నరపాలుతివర్ధను కాఁడు, పేరుబుం
గల రథికమ్మె కాదు నరకాంతులపై ననురక్తు, లందుచే
ఛలమున వత్సరాజుఁ గొన సాహసి యన్యుఁడు వీడి యుద్ధవా
ర్తలు; బల మెంత యున్న ననురాగము లేనిమొదన్ గళత్ర మా.

(ప్రవేశించి)

విజయ:—ఇదిగో లేఖ. రత్నసూత్రము సర్వాంతఃపురజన హస్తంబులనుండి తొందరింపఁబడుచుండె నని రాజమాతగారు సెల విచ్చిరి.

యౌగం:—విజయా! సర్వాంతఃపురవధూకరస్పృష్టంబు గాని వేరొండు గాని రత్నసూత్రంబు వేగిర మొసంగు మని రాజమాతగారికి మనవి చేయుము.

విజయ:—ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

(ప్రవేశించి)

నిర్ముండకుఁడు:—ఆర్యా! సుఖ మగుఁ గాక.

యౌగం:—ఏమీ నిర్ముండకుఁడా?

నిర్ముం:—ఆర్యా! మహారాజుగారిసన్నిహిత పరిచారకుం డగు హంస కుఁడు వచ్చియున్నాఁడు.

యౌగం:—ఏమీ! హంసకుఁడొక్కఁడే వచ్చె ననియా? సాలకా! ఒకముహూర్తంబు విశ్రమింపుము. అవసర మగునేనిఁ ద్వరిత మ్ముగా నైనఁ బోవచ్చును లేదేని విశ్రాంతినైన నందవచ్చును.

సాల:—ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—నిర్ముండకా! హంసకుని దోడి తెమ్ము.

నిర్ముం:—ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—ప్రభువుగారితో నవినాకృతుం డగుహంసకుఁ డిప్పుడే కాకియై వచ్చెనని వినుటచే నాచిత్త మెంతయుఁ దత్తఱ పడుచున్నది. ఏల యన.

గీ. కబురులం దెల్ప బందుగుల్ కాచి యుండ
చరిగి పరదేశ మిల్లు సేరుసరున కట్ల
ప్రియమె విందునో యకట! యప్రియమె విందు
నో గదా యని శంకింప సాగె మనసు.

(పిదప హంసకుఁడు నిర్ముండకుఁడును బ్రవేశింతురు)

నిర్ముం:—ఆర్యా! ఇటు – ఇటు.

హంస:—ఆర్యయౌగంధరాయణు లెచ్చట నున్నారెచ్చట నున్నారు?

నిర్ముం:—వీరే యార్యయౌగంధరాయణులు. సమీపింపుఁడు. (నిష్క్రమించును)

హంస:—(సమీపించి) ఆర్యునకు సుఖ మగుఁగాక.

యౌగం:—హంసకా! మహారాజుగారు నాగవనంబునకుఁ బోలేదు కదా.

హంస:— ఆర్యా! మహారాజుగారు నిన్ననే నాగవనంబునకుఁ బోయినారు.

యౌగం:— అయ్యో! నిష్ఫలంబుగదా యిక సాలక ప్రేమణము. వంచితుల మైతిమి. ఇఁక నేమైనఁ దిరిగి యాశకలదా? లేక యిప్పుడే ప్రాణములఁ బాయ వచ్చునా?

హంస:— రాజుగా రింతవఱకు జీవించియే యున్నారు.

యౌగం:— రాజుగా రింతవఱకు జీవించియే యున్నారనుటచే నేలిన వారి కొకపాటియాపద గల్గినట్లు చెప్పినట్లయ్యె. మహారాజుగారు పట్టువడిరా? ఏమి.

హంస:— ఆర్యులు చక్కఁగ నూహించితిరి. అట్లే పట్టువడిరి.

యౌగం:— ఎట్లు. మహారాజుగారు పట్టువడిరా? ఆహా! ఎంత దుష్కరకృత్యం బొనర్చిరి. నేఁటికిఁ బ్రద్యోతుని భాగ్యము ఫలించినది. నేఁటినుండియు వత్సరాజామాత్యుల కసమర్థతయు నపకీర్తియుఁ బ్రకటితంబు లగు. రాఁబోవు సనర్థంబులకు ముందే ప్రతీకారముఁ జింతించునా రుమణ్వంతుఁ డప్పు డెచ్చటికేగెను? ఆయాశ్వికసైన్య మప్పు డెందుండెను? ఏల యన

ఉ. స్వామియెడన్ సరాగ మతిసౌహృదనీతము సత్కులంబు వ్యా
యామపటిష్ఠపూరుషమయంబు గుణార్జవయుక్త మాశ్విక
స్తోమము లంచ మీ నరులఁ జొచ్చెనో? దుర్గమభూమి యాట న
ల్మోమముల విచ్చెనో? రిపుసమూహ మెదుర్కొనలేమి నొచ్చెనో? ౨

హంస:— మహారాజుగారు సమగ్రయోధబలపరివారులేని ఈయనర్థము మూఁడకయే పోయెడిది.

యౌగం:— ఏమీ! మహారాజుగారు సమగ్రయోధపరీతులు కారా?

హంస:— ఆర్యా! చిత్తగింపుఁడు.

యౌగం:— మార్గశ్రాంతిచే నీవును బడలియున్నావు. కూర్చుండుము.

హంస:—ఆర్యా! చిత్తము. (ప్రారంభించి)

ఆర్యా! చిత్తగింపుఁడు. మన మహారాజుగారు హయసుఖదాయక మీకాల మని కించిదవశిష్ట యామ రేయియందే ఇసుక రేవుదారిగ నర్మదానదిని దాటి వేణువనంబున నిజకళత్రంబునుంచి యాతపత్రమాత్ర పరిచ్ఛదుండై గజమృగయార్హంబగు బలంబుతో మృగంబుల హర్షారావంబులు పిక్కటిల్లు వీథినుండి నాగవనంబునకుఁ బ్రయాణమైరి.

యౌగం:—తరువాత తరువాత.

హంస:—తరువాత సూర్యుఁ డంపవేటుమేరంబున నుండఁ గొన్ని యోజనంబులు నడచి పోవ మవగంధీర పర్వతమునకు క్రోశ మీవలఁ దటాకపంకోత్థితమై యత్ననిర్మిత మనశ్శిలా లేపంబుం బలె భీమదర్శనం బగుగజయూథంబు మాదృష్టిపథంబునం బడియె.

యౌగం:— తరువాత తరువాత.

హంస:—తరువాత మనసేనలు తదేకదృష్టితోఁ జూచుచుండ నాగజయూథంబు భయం బుప్పతిల్ల నొక్కెడ గుమిగూడె — అప్పుడీయనర్థంబునకు మూలకంద మగునొకభటుండు మహారాజుగారిచెంతకు వచ్చెను.

యౌగం:—ఆఁపుము — ఆఁపుము. ఇచ్చటికిఁ గ్రోశమాత్రదూరంబున మల్లికాలతాచ్ఛాదిత శరీరంబుతో నఖదంతశూన్యంబుగ నేకనీలంబగు నొకయేనుఁగు నా కగుపించెనని చెప్పలేదా?

హంస:—ఏమీ! ఆర్యున కంతయు నవగతమే. ఇంత జాగ్రదవస్థయందున్నను ఇట్టియనర్థ ముప్పతిల్లినది గదా.

యౌగం:—ఓయీ! జాగరూకుని కంటెను విధియే బలవత్తరమని యెఱుంగుము. తరువాత తరువాత.

హంస:— తరువాతఁ బభ్రువుగారు నూఱు బంగారునాణెంబు లా నృశంసునకుఁ బహుదానం బిచ్చి యందఱుపిన నిట్లనిరి. హస్తి శిశుయందు నీలకువలయతను వను గజసార్వభౌమ మొకఁడు గల డని తొల్లి చదివియుంటిని. కావున మీరెల్ల రీగజయూథంబున నప్రమత్తులరై మెలంగునది. నేను వీణామాత్ర ద్వితీయుఁడ నై యాగజేంద్రముం బట్టి తెచ్చెదను అని.

యాగం:— అప్పుడు రుమణ్వంతుఁడు స్వామి నుపేక్షించెనా?

హంస:— లేదు. లేదు. ఏలినవారిని బతిమాలుకొని రుమణ్వదమాత్యుఁ డిట్లు మనవి చేసెను.

మహారాజా! ఐరావణాది దిగ్గజ గ్రహణంబును దేవరవారి పట్ల నుపపన్నంబు. కాని రక్షణకళకర్మంబు లక్కుటంజేసి దేశాంతరంబులు సన్నిహితానర్థంబులై యుండును. అందును నిర్ఝ ఝలు సుఖ్యులీను లగునరణ్యాలు నివసింతురు. కావున గజయూథయోగ్యపదాతివర్గంబుతోనే గాక సమగ్రసైన్యంబుతో మన మందఱ మట కేగుటమే కాని దేవరవా రొంటరిగ నేగుట సమంజసము కాదు అని.

యాగం:— రుమణ్వంతుఁడు మహాజనసమక్షమునందే మహారాజుగారితో నిట్లు మనవి చేసెనా? అట్లైన యాతనిప్రభుభక్తి నిరుపమ మనియే తలంతును. తరువాత — తరువాత,

హంస:— తరువాత మహారాజుగారు తన్నట్లు వారించెడు రుమణ్వంతుని దనప్రాణంబులపై నొట్టిడుకొని నివారించి నీలవలాహకమను నేనుంగు డిగి సుందరపాటలనామకహయరత్న మధిరోహించి యంబరమణి నభోమధ్యంబు చేరక మున్న యిరువది మంది భటులు వెంట రాఁ బ్రయాణ మైరి.

యాగం:— విజయంబునకా? — ఛీ, గజగ్రహణకుతూహలంబునఁ బ్రద్యోతునివంచనోద్యమంబు దలంపఁ డాయె. తరువాత — తరువాత.

హంస:— తరువాత ద్విగుణమాత్రంబుగ మార్గంబు గమించియొక్కచో సాలవృక్షచ్ఛాయయందు వృక్షసావర్ణ్యంబున దేహనీలిమంబు ప్రత్యేకము కనుఁగొన రాక తళతళ మెఱయుచు నశరీరనిక్షిప్తంబులం బోలెఁ బొలుచు చతుర్దంతములతో నాదివ్యవారణ ప్రతికృతి ధనుశ్శత ప్రమాణ దూరంబున మా కగుపించె.

యౌగం:— హంసకా! అది దివ్యవారణ ప్రతికృతి గాదు మాసంతాపాకృతి యని నుడువుము. తరువాత – తరువాత.

హంస:— తరువాత మహారాజుగారు గుఱ్ఱంబు డిగి దేవతాప్రణామం బొనర్చి వీణఁ గైకొనిరి. అంత నాదివ్యవారణప్రతికృతికి వెనుక గజనిశ్చయంబునం బోలె నొకకంఠీరవంబు గానిపించె.

యౌగం:— సింహమా? తరువాత – తరువాత.

హంస:— తరువాత సింహాన్వేషణార్థ మే మం దరిగితిమి. అప్పుడు మహామాత్రప్రధానాయుధీయులతో నిండియున్నయాకృత్రిమ వారణంబు మెల్ల మెల్లగా మహీవల్లభు నెదుర్కొనియె.

యౌగం:— తరువాత – తరువాత.

హంస:— తరువాత మనప్రభువుగారు తనకుఁ దోడుగా వచ్చిన సత్కుల ప్రసూతు లగుయోధవరుల నామగోత్రపురస్సరముగాఁ బేర్కొని యోదార్చి యిది యంతయుఁ బ్రద్యోతుని కపటప్రయోగము. మీ రెల్లరు నన్ను వెంబడింపుఁడు. నే నిప్పుడేయీప్రద్యోతుని విషమం బగుఛలప్రయోగంబు నస్మత్పరాక్రమంబుచే సమం బొనర్తు నని నుడివి వెంటనే పర బలంబుఁ బ్రవేశించిరి.

యౌగం:— పరబలంబును బ్రవేశించెనా? ఏమి చేయును?

గీ. వైరివంచనచే సిగ్గు పడియె, మాని,
సత్వసము పేతుఁ డెంతయు శౌర్యశాలి
ఒకఁడు శత్రులసన్నిధి నుండె; నింక
వైరిబలమును జొచ్చి వాఁ డేమి సేయు ?

తరువాత – తరువాత

హంస – ఆత్మాభిప్రాయానువర్తి యగుసుందరపాటలం బను నా హయరత్నంబుపైఁ గ్రీడించువాఁడుం బోలెఁ దనమనంబున నున్నంతకన్న మిన్నగఁ బరబలంబు నుఱుమాడుచు వైరి బలంబు బహుళం బగుటం జేసి యత్యంతము కాయక్లేశ మందుచు విమ్ణనష్టసకలపరివారుండై యేకాకి నగునాచే – కాదు కాదు – తనచేతనే తాను రక్షించుకొనఁ బడుచుఁ బగ లంతయు నెడ తెగక యాల మొనరించుటంజేసి డస్సి వైరిప్రహారంబులచే హయంబు గూల సూర్యాస్తమయసమ యంబున మనరాజుగారు మూర్ఛిల్లిరి.

యౌగం:—ఏమి ! మనరాజుగారు మూర్ఛిల్లిరా ? తరువాత – తరువాత

హంస:—తరువాత సమీపారణ్య ప్రదేశములనుండి యేజాతియో [illegible] కో[illegible]ల శక్తికోలంది పెకలించుకొని వచ్చి శరీరబంధనమున సామాన్యమానవునట్లు మహారాజు గారు పరిభవింపఁబడిరి.

యౌగం:—ఏమీ ! మహారాజుగారు పరిభవింపఁబడిరా ?

సీ. మాంసలాత్యంతోన్నతాంసద్వయం బొప్పి
వ్యాయాను సుదృఢ పర్వములు గల్గి
నాగేంద్రహస్తంబు నగెడునాకృతి గల్గి
తెగుదీర్ఘ వర్తులత్వములఁ దనరి
చాపసంస్ఫాలనశస్తహస్తము లొప్పి
వడి వడి శరము లెక్కిడుటఁ దెలిసి
సతతంబు విప్రపూజనశీల మొప్పారి
నిహితులఁ గను గారవించు టెఱిఁగి

గీ. శ్రీమలయందున నాలింగనములచేతఁ
బొలుచు మావత్సభూపతిభూరిభుజము
గళికిఁ దగిలించిరే మహాకఠినమతులు
కంకణంబుల నిడుఁబోట సంకెలలను.

హంసకా! తరువాత నెప్పటికి మహారాజుగారికిఁ దెలివి వచ్చినది.

హంస:— ఆర్యా! ఆపాపాత్ముల పని పూర్తియగునప్పటికి.

యౌగం:— అక్లేని అదృష్టంబుచే మహారాజుగారిశరీరమే పరిభూతమయ్యెఁ గాని తేజంబు గాదు. తరువాత — తరువాత

హంస:— తరువాత మహారాజుగారికి స్మృతి వచ్చుటఁ బరికించి యప్పాపు లీతఁడే మాయన్నం బన్న మొనరించె, కటకటా! ఈతండే మాతండ్రి నసువులం బాయంజేసె, అక్కటా! ఇతఁడే నాకొడుకుఁ జక్కాడె, అయ్యో! ఈతఁడే నామిత్రు దుర్గతిపాత్రు నొనర్చె నని వేఱొకతీరునఁ ప్రభువుగారి విక్రమంబునే యభివర్ణించుచు నొక్కమాఱుగా మనసేని నెదుర్కొనిరి.

యౌగం:— తరువాత—తరువాత.

హంస:— తరువాత నాభయం బటులుండ రెండవభయం బొండు దారసిల్లె. ఒండొరుల ప్రోత్సాహంబున వారిలో నొకఁడొక యకార్యంబున కొడిగట్టి మనసేని దక్షిణాభిముఖు నొనర్చి కదనవ్యాపారంబునఁ జెదరినతలవెండ్రుకల నిరుపచారంబుగాఁ బ్రోవు చేసి పట్టుకొని కేలం గరవాలంబుఁ దాలిచి దానికిఁ గొంతయుసి యొసంగుటకై వెనుకకుఁ గొంతదవ్వు పరుగెత్తెను.

యౌగం:— హంసకా! ఈవృత్తాంతము కొంతసే పాపుము. అంతలో నేను తెప్పిఱిల్లుదును.

హంస:— తరువాత నానృశంసుఁడు రక్తప్రవాహపంకిలం బగు నమ్మహీతలంబునఁ దనవశిచేతనే కాళ్ళు తడఁబడ జాఱిపడి ప్రతిహతారంభుఁడై తనకత్తియ తనకు మిత్తిగాఁ బ్రాణంబులఁ బాసెను.

యౌగం:—ఈ పాపాత్ముఁడు ప్రాణంబులఁ బాసెనా? ఆహా!

గీ. పరనృపులచేత నాక్రమింపఁ బడకుండ
ధర్మసాంకర్య మొంతమాత్రంబు లేక
పాలితం బయి పుడమి తన్నేలువఱని
పాలుఁ బాలింపుచుండు నాపదలయందు. ౧౦

హంస:—తరువాత నేలినవారిచేఁ దొలుదొల్తనే బల్లెపుఁబోటున మూర్ఛిల్లిన శాలంకాయనుం డను మహాసేనామాత్యుఁ డప్పుడే తెలిసి 'వల దీసాహసకార్యంబు వలదీసాహసకార్యం' బని యఱచుచుఁ దత్ప్రదేశంబునకు విచ్చేసె.

యౌగం:—తరువాత – తరువాత.

హంస:—అట్లు విచ్చేసిన పదపడి అయ్యమాత్యుండు మనఱేనికిఁ దత్కాలదుర్లభం బగు ప్రణామంబు గావించి బంధంబులనుండి విడిపించెను.

యౌగం:—మన ప్రభువుగారిని బంధనిర్ముక్తుఁ గావించెనా? మేలు! శాలంకాయనా! మేలు! దురవస్థ శత్రు నేనియు మిత్రకార్యంబునకుఁ బురికొల్పును గదా. హంసకా! ఇప్పుడు నాహృదయంబు వ్యసనంబునుండి యించుక యూఱడిల్లినదివలెనున్నది. తరువాత నా సజ్జనుం డేమి చేసెను?

హంస:—అంత నా ప్రద్యోత సచివుండు సాదరంబుగఁ గొన్ని సాంత్వవచనంబుల నూఱడించి దెబ్బలు గాఢముగాఁ దగిలియుండుటచే వాహనంబుపైఁ గూర్చుండఁజాలరని స్కంధశయనంబుపై మనరాజుగారి నుజ్జయినికిం గొనిపోయెను.

యౌగం:—మనఱేని నుజ్జయినికిఁ గొనిపోయెనా! ఇదయే నుండి నే శంకించు ననర్థము.

గీ. అపుడె నాతలపోయు ననర్థ మిదియ
కోరి ప్రద్యోతుఁ డొందినకోర్కి యిదియు

ధీరచిత్తుండు కాన నీదృశము లైన
కష్టముల నెట్లొ జీవింపఁ గలిగె నేఁడు. ౧౧

ఇటుపై

శా. ఏఁటెంగను మాప్రభుండు మును లెక్కింపఁ డాజిని, నిం
కేఁటిన్ వినఁ బత్తువాక్కులు సువాక్యము యెవ్వ విన్వినులన్
పోఁకే కల్గమి స్వర్థ మౌరుష నెటుల్ పూనున్ మదిన్, నప్రముఁ డౌఁ
గా రుద్ధుం డొకవేళఁ జెందుతను సత్కారంబొ ధిక్కారమో. ౧౨

(ప్రవేశించి)

ప్రతీహారి:—ఆర్యా! రక్షాసూత్ర మిదిగో

యౌగం:—

గీ. అవసరం బేగ భాగ్యహైన్యమున నామె
వితగమును ప్రార్థితంబు లీప్రతిసరములు
శణము ముగిసినపై హయ రాజమునకుఁ
జేయునీరాజనోత్సవ చిహ్నము లటు. ౧౩

ప్రతీ:—ఆర్యా! ఇదిగో రక్షాసూత్రము

యౌగం:—విజయా! ఉంచుము.

ప్రతీ:—రాజమాత కేమని విన్నవింపను?

యౌగం:—ఈలా గని.

ప్రతీ:—ఈలా గనఁగా.

యౌగం:—ఇట్లు,

ప్రతీ:—ఆర్యా! సెలవిండు సెలవిండు.

యౌగం:—(ఆత్మగతము) ఈ వృత్తాంతము దాఁచ శక్యముగాదు. రాజమాత కీవార్తఁ దెలియఁ జేసెదను. (ప్రకాశము) విజయా! మనస్సు గట్టిచేసికొనుము. (చెవిలో నేమో చెప్పును).

ప్రతీ:—అయ్యో! అయ్యో!

యౌగం:—నీవు విజయవు కదా. ధైర్యము వహింపుము.

ప్రతీ:—ఇదిగో పోయెదను. మందభాగ్యురాలను గదా!

యౌగం:—రాజమాతతో రాజుగారు బంధితు లైరని యొకేమాఱు విన్నవింపకు సుమా. స్నేహమర్బలంబగు మాతృహృదయంబు నెట్లేని రక్షింపవలయు.

ప్రతీ:—అట్లేని ఈ వృత్తాంత మెట్లు విన్నవింప మందురు.

యౌగం:—వినుము.

మ. తొలుదొల్తం బలుసందియంబులకు నుద్బోధంబుగా నెవ్వియో
పలుకం గా వలె యుద్ధదోషముల నాపై నామె సందిగ్ధయై
తలపోయం దనపట్టి కయ్యశుభ మాత్మన్ దుఃఖ ముప్పొంగఁ గాఁ
గలరూపంబు తెఱంగు నేర్పుమెయి వక్కాణింప నా నత్తఱిన్. ౧౪

ప్రతీ:—గ్రహించితిని. (నిష్క్రమించును)

యౌగం:—హంసకా ! నీ వపుడు స్వామితోఁ గూడ నేల పోవైతివి ?

హంస:—దేవా ! నే నప్పుడు మహారాజుగారిని వెంబడించి నాయాత్మను గృతార్థ మొనర్చుకొన నుద్యుక్తుఁడ నైతిని గాని శాలంకాయనుం డీవృత్తాంతమును గౌశాంబీనగరంబునఁ దెలుప నన్నుఁ బంచెను.

యౌగం:—శాలంకాయనుం డిట్లేల చేయును? లాభము లే దను నిరాశతో రాజుగారు పంప మానిన యీవృత్తాంతమును స్వామిప్రీతికై యిటఁ బంపఁ దలంచెనా ? లేక అనురక్తుండగు భటుండు రాజుకడ నుండుట యపాయ మని నిన్నుఁ బరిహరించుటకుఁ గా నిట్లు పన్నియుండునా ?

హంస:—అవును. నన్ను బరిహరించుటకే యట్లు పన్నియుండును.

యౌగం:—లేక - ఆశాలంకాయనుండు గర్వంబుచేఁ దనబుద్ధిసామర్థ్యమును గౌశాంబీజనులకుఁ జాట నెంచెనా ? అదియుఁ గాదేని తనయుద్యమంబు ఫలించెనని యిట్లానందించు చున్నాఁడా? కానిమ్ము. హంసకా! నన్నుగూర్చి మహారాజుగా రేమియుఁ జెప్పియుండ లేదా ?

హంస:—ఆర్యా! చెప్పియుండ కేమి? శాలంకాయనుం డిట్లు కౌశాంబి కేఁగి యీ వృత్తాంత మెఱిఁగింపు మని నన్నుఁ బంచిన పదపడి నేను ప్రయాణము కాఁబోవుచు నేలినవారికిఁ బ్రదక్షిణంబు గావింప నంతర్బాష్పాకలితలోచనంబులతో నాతో నేదియో యెక్కువగాఁ జెప్పనుంకించియు స్తంభితకంఠు లగుటచే మాట రాక కాఁబోలు మహారాజుగారు హంసకా! ఘాముక్ర. యౌగంధ (సగమునియాఁపును.)

యౌగం:—హంసకా! నన్నుఁ బేరితో బిలుచుచుంటి నని సంశోచింపకుము. నిశ్శంకముగాఁ జెప్పుము. ఇయ్యది స్వామివాక్యము గదా.

హంస:—యౌగంధరాయణుఁ జూడుమనిరి.

యౌగం:—ఉండుము. ఏ మనిరి? తక్కినమంత్రి మండలము నెల్ల నటుంచి యౌగంధరాయణునే చూడు మనిరా?

హంస:—దేవా! చిత్తము.

యౌగం:—ఇట్టియిక్కట్టు కలుగక మున్నే తగుప్రతీకారము గావింపఁ జాలని యీయదూరదర్శిని — నిరర్థకముగా నింత కాలమునుండి రాజాన్న మారగించు నీనిరర్థకజీవనుని — నిరుపయోగంబు గా నిన్నినాళ్ళనుండి రాచమన్ననల నందుచున్న యీవ్యర్థుని — నన్నుఁ జూడవలయు నని రాజుగారు తలంచిరా?

హంస:—చిత్తము.

యౌగం:—అట్లేని మాఱురూపంబుతోడి నన్ను స్వామి చూడఁగలఁడు.

చ. అరినగరంబునందో చెఱయందో యరణ్యమునందో లేక దు
ష్కరతర వేదనం దనువుఁ బాసినచోఁ బరలోకమందునో
కరము జయంబుఁ గొంటి నని గర్వితు నాన్నృపు మోసగించుచో
స్థిరనిజరాజ్యవైభవముఁ జేకొని శ్లాఘ్యుతఁ గార్యమందునో ౧౫

(తెరలో)

హా! ప్రాణేశ్వరా! హా! ప్రాణేశ్వరా!

యౌగం:—

క. శోకమున కిదిగో స్త్రీలు ప్ర
తీకార మొనర్తు రిట్లు దీనికె కాదీ
శోకం బగుఁ బో మంత్రుల
ప్రాకట సామర్థ్య ధైర్య వర్ణనముల్. ౧౬

(ప్రవేశించి)

ప్రతీహారి:—ఆర్యా! రాజమాతగారు

యౌగం:—ఏమి? [illegible]?

ప్రతీ:—ఇ[illegible]

[illegible]:—ఎట్లు?

ప్రతీ:—సుహృజ్జనపరిగృహీతుం డగు నా వత్సరాజువృత్తాంత మిట్లాయెఁ గదా ఇప్పుడు వైరనిర్యాతనంబుకన్నఁ గర్తవ్య మొండేమి యుండును. సుహృజ్జనంబుతో సంప్రతించి నిర్ధారింపఁ దగును. ఎవ్వాఁడు మహాసంకటంబులనైతము కటకటం బడఁడో, ఎవ్వఁడు విషమగతుం డయ్యు వెనుదీయఁడో, ఎవ్వఁడు వంచితుం డయ్యు నిర్విణ్ణుఁడు గాఁడో, ఎవఁడు శక్తిఘాతంబులనైతము ప్రాణంబులఁ బాయఁడో యట్టిబుద్ధిమంతుని గదా యడుగుచుంటిని. తొలుదొల్త మత్కుమారునకు వయస్యుండవును బదపడి యమాత్యుండవునగు పుత్త్రికా! మత్పుత్త్రకుఁ గొనిరమ్ము అని.

యౌగం:—ఆహా! ఈపూజ్యురాలు రాజకులోచితంబుగా గంభీరముగఁ బల్కినది. ఈయమ సంభావనను బహూకరింతును. విజయా! నీరముఁ గొని రమ్ము.

ప్రతీ:—అయ్యా! చిత్తము. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) ఇదిగో నీరము.

యౌగం:—తెమ్ము. (ఆచమించి) విజయా! పూజ్యురాలగు రాజమాత యేమి చెప్పెను ?

ప్రతీ:—పుత్రకా! మత్పుత్రకుఁ గొనిరమ్ము — అని

యౌగం:—హంసకా! ప్రభువుగారే మనిరి ?

హంస:—యౌగంధరాయణుఁ జూడుము — అని.

యౌగం:—విజయా!

గీ. రాహుసంగ్రస్తుఁడౌ ద్విజరాజుఁ బోలె
వైరిసంగ్రస్తుఁ డైనయావత్సరాజు
విడిచి పెట్టింపఁ లేనేని బిలువ వలదు
నన్ను యౌగంధరాయణుఁ డన్నపేర. ౧౨

(ప్రవేశించి)

నిర్మండకుఁడు:—ఆర్యా! ఒకయద్భుతకృత్యము జరిగినది. మహారాజుగారి దుర్దైవశాంతినిమిత్తము జరుగుసంతర్పణమున భోజన మొనర్చు బ్రాహ్మణజనంబుఁ జూచి యున్మత్తవేషధారి యగునొకద్విజుండు పెద్దగానవ్వి — 'తినుండు తినుండు మీ యిష్టము వచ్చినట్లు తినుండు. దీన నీ రాజకులంబున కభ్యుదయమే లెం' డని యంతలోనే యంతర్హితుం డాయెను.

యౌగం:—నిజముగా ?

(తరువాత బ్రాహ్మణుఁడు ప్రవేశించును)

బ్రాహ్మణుఁడు:—ఇవిగో యున్మత్తవేషధారి యగునాబ్రాహ్మణుఁ డుపయోగించుకొని పనితీరుపై వదలిపెట్టి పోయినదుస్తులు. ఈదుస్తుల ధరించి భగవానుం డగుద్వైపాయనుండు వచ్చియున్నాఁడు.

యౌగం:—ఎట్లు! ద్వైపాయనుండు వచ్చియున్నాఁడా ?

బ్రాహ్మ:—ఔను.

యౌగం:—అట్లేని ఆమహామహుని జూచెదను.

బ్రాహ్మ:—చూడుఁడు.

యౌగం:—ఏమిది రూపాంతరమువలెఁ గన్పట్టుచున్నది. ఆహా! నాకిప్పుడు స్వామిసన్నిధి కరిగినట్లే యున్నది. ఈయుపకరణంబుల ధరించి రిపునగరంబున నిర్భయంబుగా సంచరింపు మని యుపదేశింపనే కాఁబోలు భగవానుండగు బాదరాయణుఁ డీవస్తుల నాకుఁ బ్రసాదించినాఁడు.

గీ. మనుపదేశంబు కొలఁకె యున్నత్తచేష
మూని యేతెంచె నిప్పు డీమానివరుఁడు
రాజు విడిపింపఁ గలఁ డరిరాజ్యమందుఁ
గాన రాకుండ నడిపింపఁ గలఁడు నన్ను. ౯

(ప్రవేశించి)

ప్రతీహారి:—ఆర్యా! రాజమాతగారు "పుత్రుని కొరకు మాటిమాటికిఁ గోరెద" నని పలుకుచున్నారు.

యౌగం:—ఇదిగో వచ్చుచున్నాను ఆర్యా! శాంతిగృహమున నాకై వేచియుండుము.

బ్రాహ్మ:—చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—హంసకా! నీవు విశ్రమింపుము.

హంస:—చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—విజయా! ముందు నడువుము.

ప్రతీ:—చిత్తము. (ముందునడుచును)

యౌగం:—ఆహా!

గీ. రాయుచోఁ గట్టినుండియు రాలు నిప్పు
త్రవ్వుచో నీరొసంగును ధరణి యేని
కాదసాధ్య ముత్సాహుల కేది కూడఁ
దఱి నొనర్ప ఫలించు యత్నంబు లెల్ల. ౯

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

## ద్వితీయాంకము

---

(తరువాతఁ గాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచుకీయుఁడు:— ఆభీరకా ! ఆభీరకా ! నీవు పోయి మహాసేన మహారాజుగారి మాటగాఁ బ్రతీహారరక్షకునితో నిట్లు చెప్పుము. వీరు కాశీరాజుగారి యుపాధ్యాయులు. జైవంతి నామధేయులు. దూతకృత్యంబుమీఁద నిట కేఁగుదెంచిరి. ఇమ్మహాత్మునకు సామాన్యదూతలకుం బలెఁ గాక విశేష సత్కార మొనర్చి మంచిబస చూపించుటయే గాక యీ యతిథి యాతిథేయసత్కారంబుల లెస్సగాఁ బడసితినని యనుకొనులాగొనర్పఁ బ్రయత్నించునది. — అని —

ఆహా ! ఈలాగునఁ బ్రతిదినమును గోత్రానుకూలంబులగు రాజకులంబులనుండి దూత లేఁగుదెంచుచున్నారు. కాని మహాసేనమహారాజుగా రెవ్వరిని నిరాకరింపరు. ఎవ్వరిని స్వీకరింపరు. ఇది యేమిటో ? ఏమి యున్నది. కన్యాదాన విషయంబున దైవమే సమర్థంబు. ఏలయన.

చ. ఎవనికి భార్య కాఁగలదొ యీ మనవాసవదత్త యట్టిభూ
ధవుకడనుండి దూత నృపుదండకు రాఁడవు; లేనిచో మహీ
ధవుఁ డిటు దూతలన్ నృపకదంబము పంప వరప్రతీక్షుఁడ
య్యు వరగుణంబులన్ దెలిసియున్ వరు నేటికి నిశ్చయింపఁడో? ౨౦

ఓహో ! ఇం దంతఃపురపరిచారవర్గ మందంద యొదిఁగి కొనుటం జేసి మహారాజుగారిచ్చ దేశంబున కరుదెంచుచున్న ట్లున్నది. ఇదిగో. మహాసేనమహారాజుగారు ఈ చుహాను భావుఁడు.

గీ. నిబిడ దూర్వాంకుర స్నిగ్ధ నీలమణి వి
భాసిపీతాంగదోన్నత బాహుశిఖరుఁ
డీకనకతాళవనినుండి యేగుదెంచు
శరవణమునుండి వెడలు విశాఖు నట్లు. ౨౧

(నిష్క్రమించును)

విష్కంభము.

---

(తరువాత రాజును బరివారమును బ్రవేశించును.)

రాజు:—

చ. మహిపతు లెల్ల భృత్యు లటు మార్గమునందున మత్తురంగమ
ప్రహితపరాగమున్ మకుటభాగము లంట ధరింతు ర గాని యా
మహిమము నాకు మోద మణుమాత్రముఁ గూర్పదు నాగవిజ్ఞతా
మహితుఁడు వత్సరాజు గుణగణ్యుఁడు నన్ బ్రణమిల్ల కుండుటన్. ౨౨

బాదరాయణా!

(ప్రవేశించి)

కాంచుకీయుఁడు:—మహాసేనులవారికి విజయ మగుఁ గాక.

రాజు:—జైవంతికి బస నేర్పాటు చేసితివా ?

కాంచు:—బస నేర్పాటు చేసితిమి. తగినట్లు సత్కరించితిమి.

రాజు:—మంచిపని చేసితివి. నీవు రాజవంశ్యగుణాభిలాషివి. వచ్చిన పెద్దల మర్యాద చేయుటయే మంచిది. ఇట్లు దూతల నంపిన రాజులలో నెవ్వరు కన్యాప్రదానమున కర్హు లని యెవరి నడిగినను వార లొండొరులయభిప్రాయంబునకో నాయభిప్రాయంబునకో నిరీక్షించు చుందురే కాని తమయభిప్రాయంబుల నొక్కరును వెల్లడింపరు. (కాంచుకీయునివైపు చూచి) నీ వేమో చెప్పఁ దలఁచువానివలెఁ గాన్పింతువు.

కాంచు:—మఱేమియు లేదు. కన్యాప్రదానంబును గూర్చి యనుకొనుచున్నారు.

రాజు:—సంకోచింపకుము. సంకోచింపకుము. ఈకన్యాప్రదానవిధి సర్వసామాన్యమ కదా. నీవు చెప్పఁ దలఁచిన దేదియో నిశ్శంకముగాఁ జెప్పుము.

కాంచు:—మహాసేనమహారాజా! నా చెప్పఁదలఁచినది మ ఱేమియు లేదు. ఇదియే. ఇట్లు ప్రత్యహంబును గోత్రానుకూలంబు లగురాజకులంబులనుండి దూత లేతెంచుచున్నను మహారాజుగా రొక్కరిని నిరాకరింపరు. ఒక్కరిని స్వీకరింపరు. ఇదె యేమిటి? అని.

రాజు:—బాదరాయణా! ఇది వాస్తవమే. వరగుణంబులయం దతిలోభంబునను వాసవదత్తయం దతివాత్సల్యమునను వరనిశ్చయ మొనర్పఁ జాల కున్నాను. నేను వరునియందు

మ. మొదలన్ సత్కుల మెంతు నాపయి దయన్ ముఖ్యంబుగా నెన్నెదన్
మృదు వయ్యున్ దయ సారవత్సుగుణ మామీఁదన్ సురూపంబు నా
పిదపన్ గాంతిని, వీని నెన్న గుణలుబ్ధిన్, స్త్రీజనార్థంబె; యా
పిదపన్ వీర్యము నెంతు లేక యది పృథ్విన్ స్త్రీల నెట్లోము నా. ౨౩

కాంచు:—దేవరవారియందుఁ దప్ప నిప్పుడీసద్గుణంబు లెల్ల నెక్కడ నేని నొక్కనియందుఁ గాన వచ్చునా?

రాజు:—అందులకే గదా యింతగా విచారించుట.

గీ. తెలియుగాఁ దండ్రి చేయుయత్నంబుచేతఁ
గన్యకకు సద్గుణుం డైనకాంతుఁ డబ్బు;
తక్కువె భవములమాట దానిదాని
ప్రాక్కృతం బగుసుకృతంబుఁ బట్టి యుండు. ౨౪

కన్యాప్రదానకాలంబునఁ దల్లులు దుఃఖశీల లగుదురు. కాన దేవిని గూడఁ బిలుచుకొని రమ్ము.

కాంచు:—మహాసేనులసెలవు (నిష్క్రమించును)

రాజు:—అదేమో కాశీరాజు దూతను బంపినాఁ డని వినఁగానే వత్సరాజును బట్టికొన నాచేఁ బంపఁబడిన శాలంకాయను మీఁదికి నాబుద్ధి పోవు చున్నది. ఏమయియుండును. ఇంత దనుక నా బ్రాహ్మణుఁ డావృత్తాంత మేమియుఁ బంపకున్నాఁడు.

గీ. ఏనుఁగులవేట యాతని కెప్పుడు నాట
ఆతనిహృదయంబు సంతతం బందె యుండు;
కాని తన్మంత్రు లెల్లరుఁ గాద టంచు
నెందు గా యత్న మొనరించి యుండవలయు. ౨౪

(తరువాత సపరివారయై దేవి ప్రవేశించును)

దేవి:—మహాసేనులకు జయ మగుఁ గాక.

రాజు:—దేవీ! కూర్చుండుము.

దేవి:—చిత్తము [కూర్చుండును]

రాజు:—వాసవదత్త యెక్కడ?

దేవి:—ఉత్తర యనువైతాళికయొద్ద మహతీవీణాభ్యాసంబునకై పోయి యున్నది.

రాజు:—ఏమీ! వాసవదత్తకు గాంధర్వమునం దభిలాష జనించినదా?

దేవి:—ఏదే నొక్కపని యుండుట మంచి దని తనచెలియగు కాంచనమాల వీణ నేర్చుకొనుటఁ జూచి తాను గూడ వీణ నేర్చుకొనఁ దలఁచినది.

రాజు:—ఇది బాల్యంబున కుచితమే గదా.

దేవి:—దేవరవారితో నే నొకటి విన్నవింపఁ దలఁచుకొన్నాను.

రాజు:—ఏమని?

దేవి:—వీణ నేర్ప నొకయాచార్యుఁడు కావలయు నని.

రాజు:—సన్నిహితవివాహకాల యగువాసవదత్తకు వేఱేయాచార్యుఁ డేల? భర్తయే వీణ నేర్పును లెమ్ము.

దేవి:—ఆఁ! అప్పుడే నాబిడ్డకుఁ బెండ్లియీడా?

రాజు:—దేవీ! పుత్రికను ప్రతిదినము ననురూపవరునకు నొసంగుమని మ మ్ముపరోధించుచు నిపు డిట్లు పరితపించెద వేల?

దేవి:—కన్యాప్రదానము నాకభిమతమే గాని పుత్రీవియోగము మాత్రము నన్ను సంతాపపెట్టు చున్నది. అట్లేని ఎవరి కొసంగితిరి.

రాజు:—ఇంకను నిశ్చయము లేదు.

దేవి:—ఆమ్మాయికి వివాహవయస్సు వచ్చినను నిశ్చయమే లేదా?

రాజు:—

క. ఈయ లే దన్నచో పిగ్గ దేగుదెంచు
ఇచ్చితి మటన్నచోఁ జింత హెచ్చు మదికి
కర్మమునకుఁ బ్రేమకును మధ్యమున నుండి
కూఁతులం గన్నతల్లులు కుందుదు రిటె. ౨౬

ఇప్పు డన్ని విధంబుల మనవాసవదత్త యుత్తమామలకుఁ బరిచర్య సేయఁ దగినయీడులో నున్నది. అదియుం గాక కాశీరాజోపాధ్యాయుం డగునార్యజైవంతి మాతగాఁ జను దెంచి తదీయచారిత్రంబుచే న న్నెంతయు లోభపెట్టు చున్నాఁడు. (తనలో) దేవి ఏమియు బదులు చెప్పదు. కన్నీరు గార్చుచుఁ గలఁతఁ జెంది యున్నది. వరనిశ్చయ మేమి చేయఁగలదు. కానిమ్ము. ఈయమకు నాయభిప్రాయ మెఱిఁగింతును.

(ప్రకాశము)

అస్మదీయసంబంధాభిలాషులై రాజులు వచ్చినట్లు దూతల వలన వినుచున్నాము.

దేవి:—ఇవి యంతయు నిప్పు డేటికి? ఎవరి కొసంగినచో సంతాప మొందమో యట్టివారి కొసంగుడు.

రాజు:—ఆహా! ఎంతసులభముగాఁ బల్కితివి. తరువాత నేమైన మూఁడినచో నన్నుపాలంభించుటకా? వినుము.

సీ. వచ్చిరి మదీయసంబంధవాంఛఁ గాశి
రాజు మైథిలమగధసౌరాష్ట్రనృపులు
వంగపతి శూరసేనుండు వరగుణాఢ్యు
డిం దెవఁడు పాత్రుఁడో పుత్రి నీయఁ జెపుము. ౨౩

(ప్రవేశించి)

కాంచుకీయుఁడు:—వత్సరాజు.

రాజు:—వత్సరాజా?

కాంచు:—మహాసేనమహారాజా! అనుగ్రహింపుము. అనుగ్రహింపుము. ప్రియవచననివేదనత్వరచే సముదాచారంబు పాటింప మఱచితిని

(నేలపైఁ బడును)

రాజు:—ఏమీ! ప్రియవచనమా?

దేవి:—[లేచి] ఆర్యపుత్రా! జయము. (అని పోఁబోవును)

రాజు:—(హర్షముతో) దేవీ! ప్రియవచనాకర్ణనమునకు నీవు పరిహార్యురాలవు గావు. కూర్చుండుము.

దేవి:—ఆర్యపుత్రుని సెలవు. [కూర్చుండును]

రాజు:—బాదరాయణా! లెమ్ము. లెమ్ము. సంకోచింపక చెప్పుము.

కాంచు:—(లేచి) పూజ్యు లగుమనశాలంకాయనామాత్యులు వత్సరాజును బట్టుకొనిరి.

రాజు:—(హర్షముతో) ఏ మంటివి?

కాంచు:—పూజ్యు లగుమనశాలంకాయనామాత్యులు వత్సరాజును బట్టుకొనిరి.

రాజు:—ఉదయనునా?

కాంచు:—అవును.

రాజు:—శతానీకుని పుత్రుని ?

కాంచు:—నిజముగా.

రాజు:—సహస్రానీకుని మనుమని ?

కాంచు:—అతనినే.

రాజు:—కౌశాంబీపురాధీశుని ?

కాంచు:—స్పష్టముగా నాతనినే.

రాజు:—గాంధర్వవిద్యాధనుని ?

కాంచు:—అతని నట్లే చెప్పుదురు.

రాజు:—వత్సరాజునే గదా ?

కాంచు:—చిత్తము. వత్సరాజునే.

రాజు:—అట్లని యౌగంధరాయణుఁడు కాలధర్మ మొందెనా ?

కాంచు:—లేదు. కౌశాంబీనగరమున నున్నాఁడు.

రాజు:—అట్లని వత్సరాజును బట్టుకొన లేము.

కాంచు:—మహారాజ! నామాట నమ్ముఁడు.

రాజు:—

ఉ. నమ్ముఁగఁ జాల నే నుదయనగ్రహణంబును వేయుఁ జెప్ప హ
స్తమ్ముల మందరాచలము దర్పసమగ్రతఁ ద్రిప్పినట్లు; యు
ద్ధమ్ముల వైరు లానృపునదగ్రపరాక్రము ముగ్గడింత్రు క
ర్ణమ్ములఁ జొచ్చుఁ దత్సచివరత్నము మంత్రమహాప్రభావముల్. ౨౫

కాంచు:—మహారాజా! అనుగ్రహింపుము. వృద్ధుండ నదియుంగాక బ్రాహ్మణుండ. ఏలినవారియెదుట నెన్నఁడును దబ్బఱ లాడి యుండ లేదు.

రాజు:—ఆఁ. అవును నీవిదివఱ కెన్నఁడును దబ్బఱలాడ లేదు. అట్లని శాలంకాయనుం డేపియదూత నిట కంపెను ?

కాంచు:—దూత నెవ్వనిఁ బంప లేదు. జవాతిశయంబు గలఖరరథం
బుపై ముందుభాగమున వత్సరాజుం గూర్చుండఁ బెట్టుకొని
శాలంకాయనామాత్యుండు తానే వచ్చెను.

రాజు:—ఆలాగా? అహో! అట్లైన నింక మనసైనికు లెల్లరుఁ గత్తళం
బుల విచ్చిసుఖంబుగా విశ్రమింప వచ్చును. నేఁడు మొదలుకొని
సామంతరాజు లేతద్భయంబు లేమిం జేసి నాకడకుఁ బ్రచ్ఛన్న
ముగా దూతల నంపుట మాని నిర్భయంబుగా నుండవచ్చును.
వేయేల నేఁడు గదా నేను మహాసేనుండ నైతి.

దేవి:—ఏమీ అమాత్యుండు కొనివచ్చెనా?

రాజు:—కొనివచ్చెను.

దేవి:—ఇతనికొఱకే గదా మనవాసవదత్త నేరికి నొసఁగఁ దలంప
కున్నాము. (Prof. [illegible]: They [illegible] not give away [illegible] to anyone)

రాజు:—ఈతండు నాకు యుద్ధమున గెలుచుకొన్న శత్రువేయైనను
గుణసంపదఁబట్టి పట్టి నీతనికే యీయఁ దలంచితిని.
బాదరాయణా! శాలంకాయనుం డెక్కడ?

కాంచు:—భద్రద్వారమున విడిసి యున్నాఁడు.

రాజు:—పొమ్ము. యువరాజోచితగౌరవంబుతో వత్సరాజప్రధానం
బుగా నమాత్యుని బ్రవేశపెట్టు మని ముఖ్యామాత్యుఁ డగు
భరతరోహకునితోఁ జెప్పుము.

కాంచు:—ఏలినవారి సెలవు. (పోవును)

రాజు:—బాదరాయణా! ఇటు రమ్ము.

కాంచు:—ఏమి సెలవు?

రాజు:—వత్సరాజును జూడ వచ్చుపౌరుల నెవ్వరిని వారింప వలదు.

క. ఇతనిన్ మద్రిపు శౌర్య
శ్రుతపూర్వున్ బౌరజనము చూచుం గాతన్
క్రతు సంయతంబు నంతః
స్థితరోషము నైనకాదమసింగముఁ బోలెన్. ౨౯

కాంచు:—చిత్తము. అట్లే. (నిష్క్రమించును)

దేవి:—ఈ రాజకులంబునఁ బెక్కు లభ్యుదయంబు లనుభూతంబు లయ్యెఁ గాని యార్యపుత్రున కింతటి ప్రీతిభాజనం బొండేదియుఁ గాదని తలంతును.

రాజు:—నేనును వత్సరాజగ్రహణసదృశం బగుప్రియవార్త నిదివఱకు విన్నట్లేని దలంపను.

దేవి:—వత్సరాజా ?

రాజు:—అవును.

దేవి:—పెక్కురాజకులంబులు మనసంబంధముఁ గోరి వచ్చియున్నట్లు విని యున్నాను గాని యీతఁ డొకమాత నేనియు నిదివఱకుఁ బంపి యుండ లేదు.

రాజు:—మహాసేనుండ నని యేనియు సన్నుతిఁడు లెక్క సేయఁడు. ఇఁక మనసంబంధమును గోరునా ?

దేవి:—లెక్క సేయఁడా ? అట్లని బాలుఁడా ? లేక మూర్ఖుఁడా ?

రాజు:—మూర్ఖుఁడు కాఁడు — బాలుఁడే.

దేవి:—అతని నేది యింత గర్వింపఁ జేయుచున్నది ?

రాజు:—ఏదియా ? వినుము. సుప్రసిద్ధరాజర్షి విరాజితంబును వేదాక్షరసమ్మిశ్రిత మహాభారత ప్రతిపాద్యము నగుభరతవంశ మీతని నింత గర్వింపఁజేయు చున్నది. వంశపరంపరాయాత మగు గాంధర్వవేద మీతని కింత కావరము గలిగించుచున్నది. వయోఽనురూపం బగురూప మీతని నింతగా విభ్రమింపఁ జేయు చున్నది. ఎట్లో యేర్పడినపౌరానురాగ మీతని నింత విస్రంభపాత్రుఁ గాఁ జేయుచున్నది.

దేవి:—అట్లని అభిలషణీయగుణంబులు గదా యీవరగుణంబులు. ఈతఁ డేగుణంబుచే దోషి యయ్యె ?

రాజు:—దేవీ ! ఏమీ ! ఆశ్చర్యము లేనిచోట నాశ్చర్యపడెదవు. చూడుము.

గడిపాదలో నిడినయగ్ని గతి నిరంకు
శంబుగా ధాత్రి నంతట సంచరించి
శాసనం బస్నదీయ ముజ్జ్వలిత మయ్యె
సమసిపోయెడు నితనిరాజ్యంబునందు. ౩౦

(ప్రవేశించి)

— ఏలినవారికి జయ మగుం గాక. దేవరివారి యానతిచొప్పున
యువరాజసత్కారముతో శాలంకాయనామాత్యులు నగరం
బు బ్రవేశించి యేలినవారితో నిట్లు మనవి చేయుచున్నారు.
గో భారతకలోపభుక్తంబును వత్సరాజసంక్రాంతంబు నగు
ఘోషవతి యనుదర్శనీయం బగువీణారత్నంబు. మహాసేను
ద్దాని స్వీకరింప వలయును — అని — (వీణను జూపును)
జయచిహ్నముగ దీనిం బరిగ్రహించితిని. (వీణను గొని)
ఘోషవతి యియ్యదియే కాంబోలు. ఇది

గీ. శ్రవణసౌఖ్యద మధుర నిసర్గరక్తి
నఖశిఖరఘృష్టతంత్రీమనాద యైన
వీణ ఋషివాక్యగతమంత్రవిద్యవోలెం
గైవసముం జేసికొను బన్నగకులమనసు. ౩౧

ఎందేనియు సమరసముపార్జితంబు లగురత్నంబు లిష్టాను
వంబుచే బ్రీతిజనకంబులగు. ఇవ్వీణియ నాకొమరుల కొసం
దు మన్న —

గీ. అర్థశాస్త్రగుణాభిజ్ఞుం డంతె నాదు
బాలకుండు జ్యేష్ఠుం డైనగోపాలకుండు;
బాలకుండు ద్వితీయుం డనుపాలకుండు
— హారిగాంధర్వమూషి, వ్యాయామతోషి. ౩౨

ఎవ్వరి కొసంగిన నిదిసార్థకం బగు? దేవీ! వాసవదత్త
తా నభ్యసించు చున్నది గదా!
అభ్యసించు చున్నది.
అట్లని ఈవీణను మనవాసవదత్త కిమ్ము.

దేవి:—ఇప్పుడే వాసవదత్త వీణయమాట యెత్తిన నున్మత్తురాలగు చున్నది. ఈవీణ యొసంగితిమేని మఱింత యున్మత్తురాలగును.

రాజు:—ఆఁడుకోన నిమ్ము - ఆఁడుకోన నిమ్ము - అత్తగారింట నిట్టివి సులభంబులు గావు గదా. బాదరాయణా! వాసవదత్త యెక్కడ?

కాంచు:—అమాత్యునియొద్దఁ గూర్చుండి యున్నది.

రాజు:—వత్సరా జెక్కడ నున్నాఁడు?

కాంచు:—కాళ్ళకు సంకెలలు తగిలించుటచేతను కాయంబునఁ బలు గాయంబులచేతను డోలికమీఁద మధ్యమగృహంబునఁ బ్రవేశ పెట్టఁ బడియున్నాఁడు.

రాజు:—ఛీ! ఎంతకష్టము. కాయంబునఁ బలుగాయంబులా? ఇయ్యది యస్థానప్రయుక్తపరాక్రమదోషము. అన్యముగాదు. మహోత్సాహుకుఁడు గదా యిట్టిపట్ల నుపేక్షించువాఁడు. బాద రాయణా! నీవు పోయి భరతరోహకునితో వత్సరాజునకు వ్రణచికిత్సఁ గావింపు మని చెప్పుము.

కాంచు:—ఏలినవారి సెలవు.

రాజు:—ఇదిగో యిటు రమ్ము.

కాంచు:—ఇదిగో వచ్చితిని.

రాజు:—ఆతని కెందుఁ గోర్కియో యెఱింగి సబహుమానముగా దానిని దీర్చునది. ఆకారమును బట్టియే యాతని ప్రీతివిష యంబుల నారయ వలయు. అతిక్రాంతసమరప్రస్తావనల నాతని ముందు తేరాదు. క్షుతాదులపట్ల వృద్ధసముదాచారంబుగా మంగళాశీర్వాదము గావింపవలయును. కాలానుగుణము లగు కైవారంబులచే మర్యాద చూపు చుండ వలయును.

కాంచు:—చిత్తము [నిష్క్రమించి మరలఁ బ్రవేశించి] మహాసేన మహారాజా! జయము. వత్సరాజునకు దారియందే వ్రణ

చికిత్స గావింపఁ బడెను. రెండవసారి చికిత్సకు నింకను వేళ కాలేదు. ఇప్పుడు సూర్యుఁడు నడిమింటనే యున్నాఁడు.

:—ఆవీరమాని యిప్పు డెచ్చట నున్నాఁడు ?

మ:—మయూరయష్టిసౌధముసుఖభాగమున నున్నాఁడు.

:—అయ్యో ! కష్టము. ఈప్రదేశము వాసయోగ్యము కాదు. ఎండ తగులకుండుటకై మణిభూమికయందుఁ బ్రవేశపెట్టుమని చెప్పుము.

మ:—చిత్తము [నిష్క్రమించి తిరిగి ప్రవేశించి] ఏలినవారిసెలవు ప్రకార మంతయు నొనర్చితిని.

శ్రీభరత రోహకామాత్యులు దేవరవారిని సందర్శింపఁ గోరుచున్నారు.

—ఓహో ! ఆలాగా ? వత్సరాజు నిట్లు సత్కరించుట యాతని కెంతమాత్రము నిష్టములేదు. వత్సరాజ పరిగ్రహణ మేతదీయ నీతిపరిశ్రమ ఫలితమే కాన నీతని మన్నింప వలయును. నేనే యాతని ఒప్పింతును.

—సంబంధము నిశ్చయించితిరా యేమి ?

—ఇంతవఱకు నిశ్చయింపలేదు.

—అప్పుడే తొందరలేదు. ఇంకను మనవాసవదత్త బాలికయేగదా.

—నీయిష్ట ప్రకారమే కానిమ్ము. నీ వంతిపురమున కరుగుము.

—చిత్తము. [సపరివారయై నిష్క్రమించును]

—(ఆలోచించి)

చ. ఉదయనుతోడ వైరమితఁ డుంచకుఁ డౌ నని యయ్యోఁ దొల్లి యా
పదపడి పట్టి తే నితనిపట్టున మాధ్యమవృత్తి నుండెఁ బో
కదనమునం దితండు బలుగాయములం దినె, నుండె డుసితిన్
బ్రదుకునో ? లేదో ? యంచు విసవచ్చుటఁ జిత్తము తత్తఱించెడిన్.

[ఇరువురు నిష్క్రమింతురు]

ఇది ద్వితీయాంకము

---

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

## తృతీయాంకము

---

(శివప వెట్టివాని వేషముతో విదూషకుఁడు ప్రవేశించును)

విదూషకుఁడు:— [పరికించి] ఏమీ యీమాయ. ఈ దేవకులవీథికయందు నామోదకమల్లక ముంచుకొని దక్షిణామాషకంబుల లెక్కపెట్టి మూట గట్టుకొని మరల వచ్చి చూతును గదా నామోదక మల్లక మిందుఁ గాన రాకున్నది. [ఆలోచించి] ఆఁ — ఏమిది ఈ యవలగున్నండు కాఁజేసె నందుమా? ఈతఁ డొక్కమోద కంబుతోనే తృప్తిఁ జెంది నావెంట నైనను రాఁడు. కుక్క లేమైన వచ్చి నోటఁగఱచుకొని పోయె నందుమా? ప్రాకార మెంతయు నున్నతంబు గాన వాని కిట మసలుట కేనియు నవ కాశము లేదు. లేనిచోఁ బథికు లేమైనఁ జాపలంబునఁ గొని పోయి రనుకొన్న నదియును బొసగఁదు. వారతిశతభక్తులు గాన ఈమోదకము నభిలషించరు. కానిచో నొకవేళ నేనే నోటఁ బెట్టికొంటి నేమో? ఇది యెట్లు తెలియును. కానిమ్ము ఆఁ — తెలిసినది. ఒక్కపనిచేసి చూచెదను. ఇప్పు డొకమాఱు తేన్చి దానిగంధముచే నీమోదకంబును నేనే తింటినేమో తెలిసి కొందును గాక. హీ హీ — పూరింపఁబడిన వరాహావస్త్రివలెను త్తగాలినే విడుచుచున్నాను. అట్లని దీని నెవరు తీసికొని యుందురు. లేక యీ శివుఁడే నా లోహితకాత్యాయనికడ నున్నది నాదేయని తలంచి తానే యొకవేళఁ దీసికొని యుండునా? (నిరూపించి) కాదు — కాదు — ఈ బ్రహ్మచారి గాఢభుక్తవేషధారిగా నున్నాఁడు. మోదకంబుపై నాసచే దుండగ మేమైనఁ జేసి యుండునేమో. కానిమ్ము మఱల వెద కెదను. ఓహో! ఎంత పొరపాటు. ఒడిలోనే యుంచుకొని యూరెల్ల వెదకుచున్నాను. ఇదిగో నామోదకమల్లక మిూశ్వ

రుని కాళ్ల ముంగలనే యున్నది. వేగిర మేఁగి చేకొందును. స్వామీ! నామోదకమల్లకమిమ్ము. మోదకమల్లకమిమ్ము. స్వామీ! నీవుగూడ దొంగపనిఁ జేయుదువా? అయ్యో! ఎంతమోసపోతిని. ఇయ్యది గోడమీఁదిచిత్రలేఖనము గదా. సంతాపాంధకారములో నామోదకమల్లకము గానరాకున్నది. కానిమ్ము – కానిమ్ము – చేతులతోఁ దడవి చూచెదను. తడవిచూచి బలే! శిల్పకా! మేలు మేలు. స్వామీ! ఈ యుక్తవర్ణత. ఆశ్చర్య మాశ్చర్యము. చేతులతోఁ దుడిచిన కొలఁది మఱింత యెక్కువగా మెఱయుచున్నది. కానిమ్ము. నీళ్ళతోఁ దుడిచి చూచెదను. ఇచ్చట నీరమెందుదొరకునో? ఇదిగో శుద్ధజలాన్వితంబగు తటాకంబు. ఇచ్చటికే వెళ్లెదను. శివా! నీవు గూడ నావలెనే యీ మోదకమల్లకంబున నిరాశుఁడ వగుము.

(తెరలో)

మోదకంబులారా! మోదకంబులారా! హీ హీ హీ –

విదూ:— ఈ పిచ్చివాఁడు నామోదకమల్లకంబు చేకొని నవ్వుచు నఱుఁగుతోఁగూడిన మలినంబగు వర్షాకాలరథ్యోదకంబువలె నిటె వచ్చుచున్నాఁడు. నిలు నిలు ఉన్మత్తకా! నిలు నిలు. కఱ్ఱచే నొక్కేటున నీపుఱ్ఱెఁ బగులఁ గొట్టెదను.

[ పిదప నున్మత్తుఁడు ప్రవేశించును. ]

ఉన్మ:— మోదకములారా! మోదకములారా! హీ హీ హీ

విదూ:— ఉన్మత్తుఁడా! నామోదకమల్లకంబు నా కొసంగుము.

ఉన్మ:— ఏమి మోదకంబులు. ఎక్కడి మోదకంబులు. ఎవరి మోదకంబులు! ఈమోదకంబుల వదలిపెట్టవలయునా? లేక దాఁచవలయునా? లేనిచోఁ దినవలయునా?

విదూ:— తినను దినరు. వదలిపెట్టను వదలిపెట్టరు.

ఉన్మ:— ఇదిగో నానాలుక తినవలయునని లొట్టలు వేయుచున్నది.

విదూ:— ఉన్మత్తకా! నామోదకమల్లకంబుఁ గొనిరమ్ము. ఇతరుల వస్తువుల నాసించి పట్టుపడకుము.

— ఎవరురా ననుఁ బట్టుకొనువారు? నాప్రాణము పోయినను నేను వీని వదలుదునా? ఈ మోదకంబులే నన్ను రక్షించును.

ఎవరురా ననుఁ బట్టునీపాటివారు
ఎవరురా ననుఁ బట్టునింతసాహసులు
కోపాన ననుఁ బట్టుకొందురు గాక
కాపాడ నీమోదకంబులు లేవె?
వివిధరూపములతో విలసిల్లు నివియె
అవసరంబుల నాకు ననుకూలపడును.
కాలవశంబుచేఁ గడు వాడియున్నఁ
జాలుఁబో నా ప్రాణసంరక్షకివియె.
ఎవరబ్బసొమ్మని యిమ్మందు వీని
అవుర సొమ్మిచ్చి నే నంగడిఁ గొంటి.

విదూ:— ఓ ఉన్మత్తకా! నామోదకమల్లకము నా కొసంగుము. దీని ప్రత్యయమున నే నుపాధ్యాయకులమునకుఁ బోవలయును.

ఉన్మ:— నేనును దీనిప్రత్యయమున నూతామడలదూరము వెళ్ళవలయును.

విదూ:— నీవు నూతామడలదూర మేఁగుట కైరావతమవా యేమి?

ఉన్మ:— అవును. నే నైరావతమనే. కాని నాపై దేవరా డెక్కఁడు. ఎక్కినచో నాయనను గూడఁ గొనిపోదును. కాని — ఇంద్రుఁడు పాదపాశికలచే బంధింపఁ బడినాఁడఁట. ఇదిగో యిప్పుడే ధారానిగళంబు లగునీమెఱపుఁ గొరడాలచేఁ జావమోది బెడిదంపుసుడిగాడ్పులచే నీబంధంబుల ఛిన్నభిన్నం బొనర్చెదను.

విదూ:—ఉన్మత్తకా ! నీవు నామోదకమల్లకము నాకీయవా? ఈయ నిచో నేడ్తును.

ఉన్మ:—ఏడువు మేడువుము. మొత్తుకొనుము.

విదూ:—చంపుచున్నారో చంపుచున్నారు.

ఉన్మ:—నేనును ఏడ్తును - ఇంద్రుని బంధించిరో యింద్రుని బంధించిరి.

విదూ:—చంపుచున్నారో చంపుచున్నారు.

(తెరలో)

భయపడకుము - భయపడకుము - బ్రాహ్మణోపాసకా భయపడకుము.

విదూ:—(సంతోషముతో) చంద్రుఁడురాఁగానే సర్వనక్షత్రములును వచ్చినవి. బ్రాహ్మణ్యము విషాదకరము. ఈహాస్యమాత్రకుఁడౌ శ్రమణకుఁడభయమీయవలసె. (తరువాత శ్రమణకుఁడు ప్రవేశించును.)

శ్రమ:—భయపడకుము భయపడకుము - బ్రాహ్మణోపాసకా ! భయపడకుము. ఇక్కడ నెవరెవరున్నారు ? ఏల దుఃఖించెదరు ?

విదూ:—ఏమీ ! ఈశ్రమణకుఁడు ద్వారపాలకవృత్తి ననుభవించుచున్నాఁడే. అయ్యో ! శ్రమణకా ! ఈ యున్మత్తకుఁడు నామోదకమల్లకంబుఁ గొని యీయకున్నాఁడు.

శ్రమ:—ఏదీ మోదకము చూచెదను.

ఉన్మ:—శ్రమణకా ! ఇదిగో చూడుము చూడుము

శ్రమ:—ఛూ - ఛూ

విదూ:—అయ్యో ! ఛీ - ఈయున్మత్తకునిచేతిలో ఈహాస్యమాత్రకుండగు శ్రమణకుండు ఛూత్కార మొనర్చినాఁడు. నిర్భాగ్యుండనగునే నిదివఱ కేమి చూచితినో యంతే.

శ్రమ:—ఓయి యున్మత్తోపాసకా! కస్తూరికాఫేన పా బహువిస్తృతసమ్మృద్ధంబులును గోమలంబులు నకు నిచ్చివేయు మిచ్చివేయుము. వృథాగాం దిని తుడి గాకుము.

విదూ:—ఎంతకష్టము. మోదకంబు లనుకొని క యాశించితిని.

శ్రమ:—ఓ ఉన్మత్తోపాసకా! ఇచ్చివేయు మిచ్చివేయ నిన్ను శపింతును.

ఉన్మ:—శ్రమణకా! అనుగ్రహింపు మనుగ్రహింపు నుండా! నన్ను శపింపకు శపింపకు. తీసికొనుము

శ్రమ:—బ్రాహ్మణోపాసకా! నాశక్తిని జూచితివా?

విదూ:—ఈయున్మత్తకుం డీమాత్రింపం డగుశ్రమణ నకు వెఱచి భయభయంబుగం జాచంబడిన మోదకమల్లిక ముంచుకొని నిలువంబడియున్నాం కుండా! నామోదకమల్లిక మిమ్ము.

శ్రమ:—ఈమోదకంబులచే స్వస్తివాచన మొనర్తురు గూడ నిటు రండు. ఇటు రండు.

విదూ:—హీ - హీ నామోదకంబులచేతనే నేను యునా? నేను నొకగృహస్థునికడనుండి ప్ర వీనిని గొంటిని. కావలయునన్న నవి మీకు లగు రెండు. పాత్రి లగుతమ కొసంగుటచే బులే యగును. ఈయున్మత్తకుం డగ్నిగృహంబ నేగుచున్నాండు. ఇప్పుడు మధ్యాహ్నమైన మందే యీప్రదేశంబు నిర్జనం బగును. నేను మామకంబుల డాంకిలో నొకయింటం బెట్టి వెళ్ళ శాటితో నవసరము: మఱొకనికి మూల్యముతో

(అందఱు నగ్ని గృహము ప్రవేశింతురు)

ఢ జాగ్రత్త సూచన పైన స్వస్తివాచకులు

యౌగం:—వసంతకా! ఈయుద్యానగృహంబున నెవరును లేరు గద.

విదూ:—లేరు. ఇయ్యది నిర్జనముగనే యున్నది.

యౌగం:—అట్లేని మీ రిరువురు నన్నుఁ గౌఁగిలించుకొనుఁడు.

ఇరువురు:—అట్లే. (కౌఁగిలించుకొందురు)

యౌగం:—కాని మీ రిరువురుఁ దుల్యపరిశ్రములరు. కూర్చుండుము కూర్చుండుము.

ఇరువురు:—చిత్తము. (అందఱును గూర్చుండెదరు)

యౌగం:—వసంతకా! నీవు స్వామిని జూచితివా?

విదూ:—ఆఁ! చూచితిని.

యౌగం:—అయ్యో! ఎంతకష్టము. రాత్రి నెట్లో యనర్థము లేకుండ వెళ్ళఁబుచ్చితిమి. ఇంకఁ బగ లెట్లు వెళ్లునా యని చూచుచున్నాము.

గీ. పగలు గడచిన రేయిక్కై దిగులు, రేయి
పోయిగాఁ దెల్లవాఱిన పగలు మఱలఁ
బగ లెటో యని, భావ్యపక్షములఁ దలఁచు
మాకు సుఖ మెప్పు డగు గతస్మరణమందె. 3౮

రుమణ్వంతుఁడు:—తాము తథ్యము సెలవిచ్చితిరి. కేవలఖ్యాలోఁ గాలకృతభేదంబు లేకున్నను సంకటసమయంబుల రాత్రియే యనర్థపరంపరాప్రదాత్రి. ఏల యన

గీ. ఎందు వ్యవహారములయందు సందడుండ
లేక లోకానురాగంబు లేక మేని
ప్రొద్దునను దృష్టదోషులై పొలుచునట్టి
శాత్రవజనంబులకుఁ గాళరాత్రి రాత్రి. 3౯

యౌగం:—వసంతకా! రాజుగారితోఁ జెప్పితివి గదా!

విదూ:—ఆఁ - చెప్పితిని, ఈవిషయమే మాటలాడుచు స్వామివారు చాలసేపటివఱకు వెడల నీయరైరి. నేఁడు చతుర్దశియగుటచే స్వామివారు స్నాన మొనర్చువఱకు నిరీక్షించుచు నే నందే యుంటిని.

యౌగం:—స్వామి స్నాన మొనర్చెనా!

విదూ:—ఆఁ - స్నానమొనర్చెను

యౌగం:—దేవపూజఁ గావించెనా?

విదూ:—నమస్కారమాత్రంబుచేతనే సర్వదేవతల నారాధించెను.

యౌగం:—ఇట్టి సంకటసమయంబునను మహారాజు దేవతారాధనంబున నేమఱకయున్నాఁడు. ఇయ్యది శ్లాఘనీయమేగదా.

ఉ. స్నానము దేవపూజ శుభసత్క్రియ దీర్చినమీఁద నేమహీ
జానిగృహంబునం బటహజాలము మ్రోఁగుచునుండు నెప్పుడా
వానికి నిప్పు డయ్యొ! దురదృష్టముచేఁ దిథిదేవపూజలన్
మానుగ మ్రోఁగుచున్నవి నమశ్ఛ్రితంబులు కాలి సంకెలల్. ౩౬

రుమ:—ఇప్పటితమప్రయత్నము త్వరలోనే రాజుగారి కుచితతిథిసత్కారంబును జేకూర్పఁగలము.

యౌగం:—(విదూషకునివైపు చూచి) మఱలఁ జనుము. తిరిగి రాజుగారిని సందర్శించి యిట్లు మనవి చేయుము. ఏ ప్రయాణంబు కొఱకు మన మిన్నాళ్ళు మంతనమొనర్చుచుంటిమో దానికిఁ బ్రయోగకాలము జేరె. నలాగిరికిఁ గట్టుచోటుల నీరాడు తావుల మేఁతపట్టులఁ బరుండుచోటుల నోషధీకైతవంబున మత్తుపదార్థము లమర్పఁబడినవి. తత్తత్కాలప్రయుక్తమంత్రౌషధులచే నది గర్తవ్యమూఢముగా సైత మొనర్పఁబడియె. అదియుంగాక అనుకూలపవనానుసారముగా విడిచి మత్తు గలిగించుటకై ధూపంబు లాయత్తపఱచఁబడియె. రోషోద్రేకంబు గలుగఁగాకయని ప్రతిగజమదంబు సైతము సేకరింపఁబడియె. వారణంబుల కగ్ని భయకారణం బని గజశాలకుఁ జేరువ నల్పసాధనయుతం బగునొకగృహంబు దగులఁబెట్టుటకు నిశ్చయింపఁబడియె. ఆగజరాజంబు చిత్తంబు విభ్రాంతిఁ జెందుటకై దేవాగారంబుల నగారా మున్నగు వాద్యంబులు వాయింపఁ బ్రయత్నంబు చేయఁబడియె. సర్వసాధనసమువేతం బగునాధ్వనిచే మహాసేనమహారాజు తప్పక ఱేపు మన ప్రభువువారిని శరణుఁ జొచ్చెదరు. అప్పుడు

బహునందల మధిరోహించి యవనప్రపంచంబునే నేను చిమ్ముత్రి ఘారాయాత్రోత్సిత్తోదకంబుల నుద్గమం బని రాజమార్గంబుఁ బరిహరించి మనరాజుగారున్న చెఱసాల ముందుగాఁ బోవకై యక్షిణీదేవాలయంబునకుఁ బ్రయాణ మైనది.

యౌగం:—తరువాత – తరువాత

విదూ:—తరువాత మనరాజుగారు అభ్యంతరబంధనకరి చారకుం డగుశివకుం డనురాజసేవకు నెట్లో యొప్పించి చెఱసాలముంగిట నిలుచుండియుండెను.

యౌగం:—తరువాత – తరువాత

విదూ:—అంతట భుజములు మార్చుకొనుటకై యచ్చటనే కొంత తడవు బోయలు పల్లకి నాపిరి. అప్పుడా రాకుమారి బాగుగా మనరాజుగారికంటఁ బడినది.

యౌగం:—తరువాత – తరువాత

విదూ:—ఇంకఁ దరువాత లేదు – గిరువాత లేదు. ఇప్పుడు మన రాజుగారు కారాగారంబునే ప్రమదాగారంబుగా భావించుచు రాగలీలలఁ దేలుచున్నారు.

యౌగం:—స్వామి వాసవదత్తయెడ ననురక్తుఁడు కాఁడుగదా.

విదూ:—సందేహ మేల? కష్టము లెప్పుడు గట్టలు కట్టుకొనిగదా వచ్చును. తాము తలఁచినట్లే రాజుగారు రాకుమారిపై ననురక్తులై యున్నారు.

యౌగం:—మిత్రుఁడా! రుమణ్వంతుఁడా! హృదయమును దృఢము చేసికొనుము. ఈవేషములతోనే మనము వృద్ధులము గావలయుఁ

విదూ:—పైపెచ్చు రాజుగారు నాతో నిట్లు సెల విచ్చిరి. 'నీవు చని యౌగంధరాయణునితో నిట్లు చెప్పుము. మీ రెత్తిన యెత్తు నాకెంతమాత్రము నచ్చదు. నాప్రయాణ మిష్టమే కాని—నాకుఁ దొలువొల్ల నవమానము కావించినప్రద్యోతునకుఁ దత్క—

న్యాపహరణంబుచేఁ బ్రత్యవమాన మొనర్ప నాలోచించు చుండెని. ఇది యతనియెత్తువ కెను రెత్తుగాఁ బన్నిన దగుటంజేసి నన్నుఁ గామపరవశుఁ డని తలంపరాదు. అని

యౌగం:—ఔరా! శత్రుజనాపహాస్యంబుగదా యీవచనంబు. ఏమీబుద్ధి కెంత లజ్జాహైన్యము. అయ్యో! ఇది సుహృజ్జన సంతాపకారణ మయ్యె. దేశకాలంబులఁ బరికింపకుండఁగనే ప్రభువుగారు కామవిలాసంబులఁ గోరుచున్నారు. ఏల యన

మ. కొనిన్యస్తకటావృతావని నృపున్ గావించెనే సన్మనున్?
చాణోదంచితశ్ర్వఖిలారవము పెంచం జాలెనే కాముమున్?
చెఱలో నుండెనో లేవో యారయఁగ రక్షిశ్రేణి 'రాజా' యనన్
గర మాలించుచుఁ గాఁ డెవండు గుణి శృంగారప్రసంగాళికిన్? 83

విదూ:—అయ్యో! మనకుఁ గలస్వామిభక్తిని గనఁబఱచితిమి. చేతనైనంతవఱకుఁ బ్రయత్నించితిమి. ఇంత చేసినను మహారాజు మనమాట వినకున్నాఁడు. కనుక స్వామిని విడనాడి మనవారి మనము పట్ట రాదా?

యౌగం:—నీవు వసంతకుఁడవు గదా! వసంతకా! అట్లనకు మట్లనకుము.

గీ. చింతచేతను సుస్వార్థచింతచేతఁ
దత్తఱపడగురాజు నక్కటా! తెగునె విడువ?
నిని మహీపాలకుఁడు సుహృజ్జనముమాట
యుక్తకాల మెఱుంగక యున్నవాఁడు.

విదూ:—అట్లని ఈరూపములతోనే ముసలివార మగుదము.

యౌగం:—అంతటియదృష్టమే పట్టినచో నది శ్లాఘ్యమే గదా

విదూ:—లోక మెఱింగినచో శ్లాఘ్యమే – అనియే లేదు.

యౌగం: మనకు లోకంబుతోఁ బని యేమి? స్వామికొఱకుఁ గదా యీయుద్యమంబు.

విదూ:—ఎవరికొఱకీయుద్యమం బుపక్రమింపఁ బడెనో యాతఁడే ఎఱుంగకున్నాఁడు.

యౌగం:— దానివేళ వచ్చిన నెఱుంగఁ గలఁడు.

విదూ:— ఎప్పటి కింక దానివేళ ?

యౌగం:— ఎప్పటికి మనయుద్యమంబు నెఱవేఱునో యప్పటికి.

విదూ:— మీ ప్రయత్నము ఫలింపవలయు నని మీ కింత పట్టుదల యున్నచోఁ జెఱసాలనుండి రాజుగారిని అంతఃపురశాలనుండి రాజకుమారిని ఇరువుర నొక్కమాఱే యేల లేవఁ దీయరాదు ?

రుమ:— ఈవిషయమునఁ దాము చక్కఁగా నాలోచింప వలయును.

యౌగం:— ఇరువురఁ దీసికొని పోవుటకా ? కానిమ్ము. ఇదియే నా రెండవప్రతిజ్ఞ.

గీ. దేవి నల్లసుభద్ర గాండీవి పోలెఁ
బద్మవల్లిఁ గుంజరప్రభువు పోలె
ప్రాపుఁబోడిని రేఁడు గొంపోవునట్లు
చేయలేకున్న యౌగంధరాయణుఁడనె ? ౮౦

మఱియు —

గీ. ఘోషవతిని నళాగిరికుంజరంబు
వత్స వాసవదత్త మావత్సరాజు
ఎల్లి కౌశాంబికిం జేర్పనేనిఁ బిలువఁ
జనదు యౌగంధరాయణుం డనుచు నన్ను. ౮౧

(చెవియొగ్గి) ఏమియో శబ్దమువలె నున్నది. ఆశబ్ద మేమియో తెలిసికొనిరమ్ము.

విదూ:— చిత్రము. (వెళ్ళివచ్చి) సూర్యభగవానుండు పశ్చిమాభిముఖుం డగుటచే నంధకారము కగ్గి జనము విచ్చలవిడిగా సంచరించుచున్నది. ఇఁక నేమిచేయుదము?

రుమ:— అట్లైన ఈయగ్నిగృహంబునకుఁ జతుర్ద్వారంబులు గలవు గాన మనసంఘము నలుముఖంబుల విడిపోవుఁ గాక.

యౌగం:— కాదు - కాదు - మనసంఘము కలసియే యుండుఁ గాక - మనశత్రుసంఘాతమే విడిపోవుఁ గాక. మీపనుల మీరు చూచుకొనుఁడు.

ఇరువురు:— అట్లే (నిష్క్రమింతురు.)

ఉన్మ:—

—♦ ద్విపద ♦—

(బంగారు మాచంద్రుఁ బట్టుఁ జూచెదవె
దొంగ రాహువ ! నీకు దొరకి నిచ్చెదనె ?
దొంగకు మ్రింగితిఁబో వీని నంచు
అంగిలిఁ జీల్చి యియ్యాపె విడిపింతు.
గగ్గోలు సేయుచు గరువంపుఁదేజి
పగ్గాలు త్రెంచుక పాఱెడు నదిగొ
ఇద్దానిపై నెక్కి యిప్పుడే నేను
పెదయెత్తుగఁ గోట బిచ్చ సాఁగింతు
చిట్టినాయనలార ! ఛీ! కొట్టకండి
కొట్టినచో మిమ్ముఁ గొట్టెద మఱల
ఆడు మందురొకో! నన్నాడు మందురొ
చూడండి నాయాట చూడండి నేఁడె.)

హీ — హీ — రాహువు చంద్రుని మ్రింగుచున్నాఁడు. విడువు చంద్రుని విడువు. విడువవేని నీనోరు బ్రద్దలుచేసి విడిపింతును. ఇదిగో ఇదిగో పొగరుఁబోతుగుఱ్ఱము పగ్గాలు త్రెంచుకొని యిటే పరుగెత్తుకొని వచ్చుచున్నది.— ఇదిగో ఇదిగో నాల్గువీథులబాజారులో నున్నది. దీని నెక్కి భిక్షయెత్తి కొందును. వీరే వీరే పిల్లదొరలు. పిల్లదొరలారా! నన్నుఁ గొట్టుచున్నారా ? నన్నుఁ గొట్టకండి కొట్టకండి. ఏమనుచున్నారు ? కొంచెమాడు మనియా ? చూడండి చూడండి దొరలు. పిల్లదొరలారా ! నన్ను మఱలఁ గఱ్ఱలతోఁ గొట్టుచున్నారా ? కొట్టకండి కొట్టకండి. కొట్టినచో నేను గూడ మఱలఁ గొట్టెదను. (నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము

## చతుర్థాంకము

(తరువాత భటుఁడు ప్రవేశించును)

భటుఁడు:—ఎంతకాల మాయెను. వెదకి వెదకి వేసారి పోవుచున్నాను. రాకుమారి జలక్రీడ సలుపుతలంపున భద్రవతిని గొనిరమ్మని యానతిచ్చినది. భద్రవతీపరిచారకుఁ డగునా గాత్రసేవకుఁ డింతవఱకుఁ గాన్పింపకున్నాఁడు. భావా! పుష్పదంతా! నీకు గాత్రసేవకుఁ డేమేని గాన్పించెనా? ఏమనుచున్నావు? ఈగాత్రసేవకుఁడు కండిలశౌండికియింటఁ జేరి కల్లు త్రాగుచున్నాఁ డనియా? అట్లేని నీవు నీపనిఁ జూచుకొమ్ము. ఇదియే కండిలశౌండికి యిల్లు. వీనిని బిలిచి చూచెదను. గాత్రసేవకా! గాత్రసేవకా!

(తెరలో) పునరుక్తి. Hindi - Telugu

గాత్రసేవకుఁడు:—ఎవడోసీడు. రాదారిలో వుండి గాత్రసేవకా! గాత్రసేవకా! యని ఒకే మోయన పిలుత్తాడు.

భటుఁడు:—వీఁడే గాత్రసేవకుఁడు. కల్లు త్రాగి త్రాగి మత్తిల్లి మత్తిల్లి జపాకుసుమంబులఁ బోలు నెఱ్ఱనికన్నులతో నిటే వచ్చుచున్నాఁడు. వీని కెదురుగా నుండరాదు.

(పిమ్మట యథోక్తాకారంబుతో గాత్రసేవకుఁడు ప్రవేశించును.)

గాత్ర:—ఎవడోసీడు. రాదారిలో వుండి గాత్రసేవకా! గాత్రసేవకా! అని ఒకే మోయన పిలుత్తాడు. కల్లుదుకాణంనుండి యిప్పుడే వత్తుంటే మామ కోపంతో చూచిండు. ఐతేమ్. ముందెదు అమృతంలాంటి కమ్మనికల్లు వేయించి దానిమీద మసాలాతో డిమాంసంముక్క నోటఁ దగిలించా. కల్లోయిత్తే కోడలు ప్రేమిత్తది గాని యత్త కట్టుచ్చుకోకుండాలె.

ధన్యాలు — గేయము —

దన్నాలు రా వోళ్ళ దన్నాలు రా
దన్నాలు రా వోళ్ళ దన్నాలు రా
కల్లూ శాతనె కైపు గల్గాల రా
కల్లె వోళ్ళను బూయః గల్గాల రా
కల్లుశాతనె వోళ్ళు కడగాల రా
కల్లుశాతనె సావు గల్గాల రా
కల్లూతో బతికుంటె కైలాస మే రా
కల్లూతో సచ్చితె కైవల్యమే రా
అట్టయిన యిట్టయిన ఆనందమే రా
ఎట్టయిన కల్లున్న ఏమి దుఃఖం రా
బోగా లన్నే లేమి బోగాలు రా
తాగాల రా కల్లు తాగాల రా,

పనికిమాలోన్నోళ్ళు కొందఱు పైకం కొల్లగా వుండిగూడా — రోజూ కొడుకుల పెళ్ళాలగోళ్ళు, వోళ్ళు పడేపాట్లు యింటూ కంటూ గూడ ఖర్చవుతుందని కామోల్లు కల్లుకో నేర్లు కట్టించరు. తెలివితక్కువోళ్ళు. పాపం వోళ్ళ కెక్కడి కష్టా లెవ లోకంలో గూడా వుండవోసి.

టుఁడు:— (సమీపించి) గాత్రసేవకా! ఎంతసేపటినుంచి నిన్ను వెదకుచున్నాను. రాకుమారి జలక్రీడ సేయుతలంపుతో నున్నది. భద్రవతీగజంబు గానరాదు. నీ విట్లు కల్లుద్రావి యొడలెఱుంగక తిరుగుచున్నావు.

విరహము రాజు

గాత్రసేవకుఁడు:— ఔ ఆమె వోళ్ళెఱుగదు. ఆయన వోళ్ళెఱుగడు. నేనూ వోళ్ళెఱుగను. నీవూ వోళ్ళెఱుగవు. అందఱూ వోళ్ళెఱుగరు. ఏమంటావ్?

టుఁడు: — అది యంతయు నటుండ నిమ్ము. కోటలో భద్రవతిని ప్రవేశపెట్టకుండ నీ వెక్కడఁ దిరుగుచున్నావు?

గాత్ర:— ఇదిగో ఇక్కడ తిరుగుచున్నాను. ఈడ తాగుచున్నాను. నీతో తాగుతున్నా. కోపించొద్దూ. నే నిప్పు డేంశేయాలె.

భటుడు:—ఈయసంబద్ధ ప్రలాపంబులుగట్టి పెట్టు. త్వరగా భద్రవతిని బవేశపెట్టు.

గాత్ర:— దా — దా — భద్రవతీ ! దా — అమ్మో ! భద్రవతి అంకుశాన్ని కుదెట్టి కల్లు నీళ్ళు తాగానే మఱెట్టా ?

భటుడు— స్వభావవినమ్రయగుభద్రవతి కంకుశ మేటికి? త్వరగా వెళ్ళి భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర:— దా — దా భద్రవతీ ! దా — అమ్మో ! ఇంకెట్టా ? భద్ర వతిదండ కుదెట్టి కల్లు తాగానే.

భటుడు:—పుష్పమాలాలంకృత యగుభద్రవతి కాదండతో నేమి ? శీఘ్రముగా వెళ్లి భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర:—దా — దా — భద్రవతీ ! దా — అమ్మో ! ఎట్టా ? భద్రవతి గంట కుదెట్టి కల్లుతాగానే.

భటుడు:—జలక్రీడాసమయంబున భద్రవతికి గంట యేమిటికి లెక్కు. జాగుచేయక భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర:—దా — దా — భద్రవతీ ! దా — భద్రవతి కొరడా కుదెట్టి కల్లు తాగానే యెట్టా ?

భటుడు:—కొరడా యేటికి లే వేగిరమే భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర:—దా — దా — భద్రవతీ దా — అమ్మో !

భటుడు:—అమ్మో ! ఏమిటి

గాత్ర:—అమ్మో ! నేను.

భటుడు:—ఏమిటి నీవు?

గాత్ర:—అమ్మో ! భద్ర

భటుడు:—భద్ర — ఏమిటి ?

గాత్ర:—అమ్మో! భద్రవతిని

భటుఁడు:—భద్రవతిని ఏమిటి?

గాత్ర:—భద్రవతిని గూడఁ గుదెట్టినాను.

భటుఁడు:—అల్లని నీవు కాదు దోషివి — ఆకండిలశౌండికియే — రాజవాహనమును గొని నీకుఁ గల్లు పోయునా?

గాత్ర:—నేచెప్పాను గూడ మొదలంటా చెడకని —

భటుఁడు:—ఏమీా! శబ్దము?

గాత్ర:—ఆఁ — తెలిసింది. తెలిసింది. ఆకల్లుఅమ్మెదానిఇల్లు పడగొట్టు కొని భద్రవతి పాఱిపోతున్నది.

భటుఁడు:—ఏమనుచున్నావు? (ఆకాశమునఁ జెవియొగ్గి) వత్సరాజు వాసవదత్తను గొనిపోవు చున్నాఁడనియా?

గాత్ర:—(సంతోషముతో) వత్సరాజున కవిఘ్న మగుగాక.

భటుఁడు:—తాగ్రుము. తాగ్రుము.
ఇంకను మత్తిల్లి యుండే తిరుగుచుండుము —

గాత్ర:—ఆఁ! ఏమంటివి? ఎవఁడు రా మత్తుఁడు? ఎవ్వనికి రా మదంబు? మమ్ముల ఆర్యయౌగంధరాయణ మహామాత్యుల చేఁ దత్తదుచితస్థానంబుల నియోగింపఁబడిన చారపురుషులను గా నెఱుంగుము. నేనును మిత్రులకు సైగఁ జేయుదును. వీరే నామిత్రులు నిర్బంధములనుండి విడివడిన నల్లత్రాచులవలె నిటునటు పరుగిడుచున్నారు. ఓహో! మిత్రులారా! వినుఁడు వినుఁడు. A

గీ. సలిలపూర్ణంబు సకుశంబు సంస్కృతంబు
నవశరావంబుఁ గొనక, డొందు నరకమతఁడు
స్వామియన్నంబుఁ దినుచు నాస్వామికొఱకు
సమయ మ్మేతేర సమరంబు సలుపఁ డెవఁడు.

ఎక్కడ నున్నాఁడు సెపుమా యిపు డార్యయౌగంధ రాయణుఁడు — అడుగో ఆర్యయౌగంధరాయణుఁడు — ఈమహానీయుండు —

మ. ఉరుతీక్ష్ణామలఖడ్గ మూని విడి యా యున్మత్తవేషంబు నం
బరముల్ దాల్చి పసిండికేడె మలరన్ వామాగ్రహస్తంబునన్
శిరమందుం దలపాగ తెల్లనిసిరుల్ సింగారముం గూర్ప గో
చరమౌఁ దళ్కనిమించు చందురుఁడు పజ్జం బొల్చు మేఘంబునాన్. ౪౩

ఔరా! యుద్ధంబు మహాత్తరంబుగా జరుగుచున్నది.

ఉ. మదగజరాజబృందముల మావటివారలతోనె గూల్చి, యా
పిదప హయంబులం దునిమి బిట్టుగ రౌతులతో, క్షణంబులోఁ
జెదరఁగఁ జేసి సేనఁ దుద సింధురదంతహతాత్మబాహుఁడై
కదనము వీడ కుండఁగనె ఖడ్గము జాఱియుఁ బోరు చుండెడిన్. ౪౪

అయ్యో! ఛీ! ఆర్యయౌగంధరాయణుఁడు పట్టువడెఁగదా. ఇప్పుడు నే నార్యయౌగంధరాయణుచేరువనే మెలంగుదును.

(నిష్క్రమించును)

భటుఁడు:—ఏమిది! ప్రాకారతోరణంబులు దప్ప సర్వము కౌశాంబీ నగరమువలెనే యున్నది. కానిమ్ము.. ఈవృత్తాంత మంతయు నమాత్యున కెఱింగించెదను.

(ప్రవేశకము)

[తరువాత ఇరువురు సామాన్యభటులు ప్రవేశింతురు]

ఇరువురు:—అయ్యలారా! తొలఁగుఁడు — తొలఁగుఁడు.

ప్రథముఁడు:—అయ్యో! గొంతెంత బ్రద్దలుచేసికొనుచున్నను బౌరులకోలాహల మెక్కువగానే యున్నది.

ద్వితీయుఁడు:—అయ్యో! నే నెంత బిగ్గఱగా నఱచుచున్నను రాజదారిక యగువాసవదత్తను గొనిపోయి రని వినుటవలనఁ బొడమిన విభ్రాంతిచే నా పలు కొకఁడేనియు లెక్కసేయ కున్నాఁడు —

అయ్యలారా! ఏ మనుచున్నారు. తొలఁగుఁ డని వారించుట యెందుల కనియా? ఆర్యయౌగంధరాయణుఁడు పట్టువడియెను— ఏ మనుచున్నారు? ఎట్లు పట్టువడియె ననియా— వినుఁడు. ఖడ్గద్వితీయుండై యార్యయౌగంధరాయణుండు ముహూర్తకాలం బక్షౌహిణుల యగ్రవేగంబు నాఁపి యతి భీకరంబుగ నాలంబు గావించుచు విజయసుందరం బనునొక్క దంతావళంబుపైఁ గరవాలంబు విసరుడు నయ్యది దానిదంతంబునకుఁ దగిలి భగ్నం బాయెను. ఖడ్గదోషంబుచేఁ బట్టువడియెఁ గాని పురుషదోషంబుచేఁ గాదు.

ప్రథముఁడు:— ఓహో! జాగరూకులరై యుండుఁ డిది ప్రాకారతోరణంబులు లేని కౌశాంబియే సుమా.

ఇరువురు:— అయ్యా! దిగుఁడు — దిగుఁడు —

(అప్పుడు బద్ధబాహుఁడై ఫలకశయనీయంబుపైఁ గొనిరాఁ బడుచు యౌగంధరాయణుండు ప్రవేశించును)

యౌగం:— ఇదిగో — దిగుచున్నాను.

ఉ. వైరులచేతినుండి యటు వత్సనృపున్ విడిపించి బల్మిపైఁ
బోరి స్వఖడ్గదోషమునఁ బోరున వైరులచేతఁ జిక్కి యీ
తీరున నేనియిక్కటులఁ దీరిచి చేరుచు నుంటి గెల్పుచే
కూరె నటన్న వేడుక దిగుల్ సన రాజకులంబు హాయిగన్. ౪౫

ఔరా! సౌఖ్యము గదా నిష్కళత్రులకుఁ గాంతారప్రవేశంబు. రమణీయంబు గదా యవాప్తకాములకు దైవవినిపాతంబు. అపశ్చాత్తాపకరంబు గదా సంచితధర్ములకుఁ గాలధర్మంబు. నే నన్ననో —

చ. భయమును వైరమున్ బరిభవంబు సమంబుగ వీడి కార్యమున్
నయవినయంబులన్ శరగణంబులఁ దీరిచి శత్రురాజ్యల
క్ష్మియుఁ దొలఁగఁగఁ జేసి నిజమిత్రులయయ్యపకీర్తి తోడఁ దన్
జయమును వత్సభూపతిని శాశ్వతకీర్తిని గాంచఁ గల్గితిన్.

ఇరువురు:—తొలఁగుఁడు — తొలఁగుఁడు — అయ్యలారా! తొలఁగుఁడు.

యౌగం:—నన్నుఁ జూడ నభిలషించుజనంబును దొలఁగింపఁజనదు.

చ. అరయుఁడు గండు మంత్రిపదమం దభిలాష మనంబులోపలన్
పరఁగెడురాజపూరుషు లవారిగ నేనినిమిత్త మిట్లు దు
ర్భరదురవస్థ లన్నిటికిఁ బాలగునన్ బరికించుచో మదిన్
దిగమగునో తదీప్సితము ధీరత లేమి వెసన్ దొలంగునో? ౪౩

ఇరువురు:—తొలఁగుఁడు — తొలఁగుఁడు — మీ రిదివఱ కెన్నఁ
శ్రీయౌగంధరాయణుఁ జూడరా ఏమి?

యౌగం:—పూర్వము చూచిరి గాని యీరూపుతోఁ గాదు.

గీ. పిచ్చివేసంబుతో నటు రచ్చలందుఁ
బరుగిడెడునాకు నీరూపు భావ్య మగునె?
ఇట్టిరూపంబు గొనినందు కిప్పుడు చూపఁ
బడుచునున్నవి గనుఁడు నాపనులు ప్రజలు. ౪౪

(ప్రవేశించి)

భటుఁడు:—ఆర్యా! తమ కొకప్రియవార్తను దెలుపుచున్నాను. వత్సరాజును గూడఁ బట్టికొనిరఁట.

యౌగం:—ఇది యెన్నఁటికిని జరుగఁబోదు.

ఉ. బంధముఁ బాసి యెప్డు యరిపట్టణమందుననుండి వింధ్యసం
బంధివనప్రదేశముల భద్రవతిత్వరఁ బట్ట వచ్చు దు
స్సంధులు దప్పఁగాఁ ద్రుటి వెసన్ బహుయోజనముల్ గమించు నా
బంధురకీర్తి వత్సజనపాలుఁడు వైరులచేతఁ జిక్కునే? ౪౫

భద్రా! అక్లని ఎట్లు పట్టుకొని రని వింటివి?

భటుఁడు:—నళాగిరిని వెంటఁ బరుగెత్తించి పట్టుకొనిరఁట.

యౌగం:—నళాగిరి కంతసామర్థ్య మున్నమాట వాస్తవమే గాని అది స్వస్థచిత్తముతో లేదు. అదియును గాక సరిగా శిక్షఁ బొందినదియుం గాదు.

గీ. ఏనుఁగుల కగు వడి మాపటీనిశిక్ష
అట్టియెడ శిక్షయే లేని యాగజంబు
వత్సనరపతి నడిపెడుభద్రవతిని
మించి నడుపంగ నల్లవిరించివశమె ? ౫౦

భటుఁడు:—ఆర్యా ! ఈప్రదేశం బాయుధీయసురక్షితం బగుటం జేసి తా మీ యాయుధాగారంబుననే యుండ వలయునని మంత్రి గారు సెలవిచ్చుచున్నారు.

యౌగం:—ఔరా ! ఎంతపరిహాస్య మీవచనము.

గీ. వత్సరా జనువహ్నిని వైచి చెఱను
జాగరూకత వలసినసమయమందు
మంత్రులు పరుండినారు మైమఱచి యిపుడు
రత్న మేగినఁ బెట్టెకీరక్ష యేల ? ౫౧

(నడిచి)

భటుఁడు:—ఇదియే ఆయుధాగారము ఆర్యులు ప్రవేశింతురుగాక.

(ప్రవేశించి)

భటుఁడు:—మంత్రిగారు తమకుఁ గట్లు దొలఁగింప సెల విచ్చిరి.

యౌగం:—అట్లని తొలఁగింపుము. నిజము. భరతరోహకుండు నన్నుఁ జూడఁ దలఁచుచున్నాఁడు. నేనును భరతరోహకుని జూడఁ గోరుచున్నాను.

సీ. రోషియై నాగర్వభాషితోక్తులఁ జేసి
కడుఖేద మాత్మలోఁ గాంచువాని
నేఁ దూఁచినటు నీయనీతిప్రయుక్తికి
నెదు రెత్తి దోఁచకే యొసఁగువాని
నీతిశాస్త్రంబుల నిర్ధారితంబులౌ
సూక్తులపై దృష్టి చొఱనివాని
నన్ను వంచించినంతకు మించి నాబుద్ధి
బలముచే వంచింపఁబడినవాని

గీ. తనదుయత్నమ్ము మాఱు యత్నమ్ముచేత
జాగరూకత భంగంబు సలుపఁగూరు
విజయిఁ గాంచఁ బ్రతిక్రియావిరతి సిగ్గుఁ
బొందె తలవాంచుమల్లుని బోలె నిపుడు.

(తరువాత భరతరోహకుఁడు ప్రవేశించును)

భరతరోహకుఁడు:—ఎచ్చట యౌగంధరాయణుఁ డెచ్చట యౌగంధరాయణుండు ?

ఉ. మోసముచే నొనర్చకొని మున్నె స్వకార్యము దుర్నిరీక్షుఁడై
గాసిలి తానకైయిపుడు కాలముగాక యణంగి మంత్రిమున్
జేసి ఫలింప నిట్లు పదశీలితమై తలయెత్తు పాము నా
భాసిలు నీ మహామహుని భవ్యుని నేమని నొవ్వనాడుదున్. ౫౩

భటుఁడు:—యౌగంధరాయణమంత్రిగారు రేలినవారికొఱకు ఎదురు చూచుచు నాయుధాగారముననే యున్నారు.

భరతరోహకుఁడు:—సరే కానిమ్ము.

ఆ. వె. కపటనీలహస్తి గావించి వంచింపఁ
బడియె నితఁడు మంత్రిపదవియందు
తత్ప్రబోధ మిపుడు తలపెట్టి మెవొ యన
నెదురు చూచుచుండె నిట్లు నాకు. ౫౪

భటుఁడు:—ఆర్యా ! ఈతఁడే యార్యయౌగంధరాయణుఁడు.

భరతరోహకుఁడు:—(సమీపించి) ఓహో ! యౌగంధరాయణా

యౌగం:—ఓ.

భటుఁడు:—ఏమా యీస్వరగాంభీర్యంబు. ఈ మహామహుని యేకాక్షరాత్మకం బగుమాటచేతనే యీప్రదేశమెల్ల నిండి పోయినది.

భరత:—(కూర్చుండి) వత్సరాజామాత్యా ! యౌగంధరాయణుఁడను నశరీరంబు లగునక్షరంబులనే యిదివఱకు వినుచున్నాము. నేఁడు మాభాగ్యంబుచే నిన్నుఁ జూడఁ గల్గితిమి.

యౌగం:—ఏమీ! మాభాగ్యంబుచేతనే చూడఁ గల్గితిమనియా?

ఆ. వె. కనుము రక్తసిక్తగాత్రు నీగతి వైర
సద్వ్రతైకనిష్ఠ సలుపు నన్ను
జనకుఁ బరిభవించుచెనఁటిరి నుఱుమాడి
తనిసి శాంతి నున్న ద్రోణిఁ బోలె. ౫౫

భరత:—గజవ్యాజంబునఁ బ్రభువు గొనిపోవుటయు శౌర్య మనియే గర్వించుచున్నావా?

యౌగం:—ఏమీ! గజవ్యాజంబునఁ బ్రభువుఁ గొనిపోవుట యనియా? అట్లైన ఇది మాత్రము మీకు న్యాయమా?

మ. వరనాగం బని సాలవృక్షముదరిన్ వత్సేశు వంచించుటల్
చెఱఁ జే దిండుగ రిత్తసేలఁ బతికిన్ లజ్జం బొనర్పించుటల్
కరివశ్యత్వము వేఁడు గోల్పడునటుల్ గా వీణఁ గైకొంటలున్
మఱి న్యాయంబులు? త్వత్కృతం బనుకరింపన్ మావి యన్యాయముల్?

భరత:—యౌగంధరాయణా! మహాసేనాత్మజ యగువాసవదత్త నగ్ని సాక్షిగా శిష్యురాలిఁ జేసికొని మీవత్సరాజు అదత్తాపహారంబు గావించె. ఈచోరవర్తన మాతనికి న్యాయ్యమో?

యౌగం:—అట్లనకు మట్లనకుము. పాపము శమించుఁగాక పాపము శమించుఁగాక! శిష్యురాలిగఁ గొనుటయే జేనికి వివాహంబని యెఱుంగుము. లేనిచో —

గీ. భారతమహాన్వవాయసంభవుఁడు వత్స
దేశముల కూర్జితుం డౌనధీశుఁ డెట్లు
దేవిగాఁ జేకొనక యుపదేశ మొసఁగు
హొయలు గలదానిఁ బూపలేవయసుదాని. ౫౬

భరత:—అది యటుండ నిమ్ము. వత్సరాజు మామహాసేన మహారాజుల వలన బంధమోచనసత్కారంబు వడసెఁగదా! దానిసైతము పరిగణింపక తత్సుతఁ గొనిపోవుట సమంజసమా?

యౌగం:— ఇటు లాడకు మిటు లాడకుము.

గీ. విను నళాగిరి గజశాస్త్రవిదులమాట
దాన నొనరించు మాకెనియాన గాన
రాజు మారాజు విడిచె స్వరక్షకొఱకు
నెయ్యురకుఁ బ్రాణమానముల్ నిలుపుకొఱకు. ౫౮

భరత:— అట్లు నళాగిరిగ్రహణార్థమే మీ ఱేడు విడిపింపఁబడినచో మహాసేనులచే మఱల నేల బంధింపఁ బడఁడు?

యౌగం:— ఏల బంధింపఁబడఁడా? తన్నుఁ దనయాపుత్రులను రక్షించినమహాసీయుని కృతఘ్నుఁడై బంధించినచో లోకంబు మాఱు ననుభయంబుచేత.

భరత:— రాజ్యతంత్రజ్ఞుఁడ వయ్యు నిట్లు పలికెద వేల? యుద్ధావజితులవిషయమై శాస్త్ర మేమి దండంబు విధించుచున్నది?

యౌగం:— మరణదండమును.

భరత:— వత్సరాజు మరణదండార్హుఁడేని మాచే నట్లేల సత్కృతుండయ్యె?

యౌగం:— కనుకనేగదా మహాసేనులశరీర మంట లేదు.

భరత:— ఇదియు శక్య మనియే తలంచెనేమి మీరాజు?

యౌగం:— సంశయ మేమి?

గీ. హస్తగతుఁడైనమీ తెని నణఁచకుండఁ
బ్రోచె ధర్మాత్ముఁడైనమాభూవరుండు
ఏకివకముపైకి నెక్కి కేకరణి ధరణి
వైజయంతిని గొనుటకు వలను పడును? ౫౯

భరత:— కానిమ్ము కానిమ్ము. మహాసేనులకుఁ బ్రతికూలంబు గావించి మఱలఁ గౌశాంబి కేగుదు ననియే తలంచితివా?

యౌగం:— ఏమీ? ఎంత పరిహాస్య మీమాట!

గీ. ఏఁగుదెంచితి మీయెట్టయెదిరి కేను
తక్కుమనులను వరింప లెక్కయేమి?

పెల్లగించితి మొదలంటఁ బెద్దమ్రాను
చిన్నకొమ్మలఁ దునుముటే చిక్కు యింక. ౨౦

(ప్రవేశించి)

కాంచుకీయుఁడు:—(చెవిలో) ఈలాగీలాగు.

భరత:—బిగ్గఱగాఁ జెప్పుము.

గీ. కారణంబులు పెక్కులు గలిగి యున్నఁ
గావు మా కెన్నఁటికి నపకారి వీవు
నీదుసుగుణంబులందున లేదు గినుక
ఇదిగో భృంగార మొసఁగితి మిద్ది గొనుమ. ౨౧

యౌగం:—అయ్యో ! ఛీ ! ఛీ ! వలదు వలదు.

గీ. ఆఱు వింతకు నేఁ గాల్చినట్టి యిండ్లు
శాంతపడ విప్పటికి మంత్రిజనులమదులు
ఇంతలో నాకు దోషికి నింత పూజ !
దండ్యునకు వధ గాదె సత్కార మన్న. ౨౨

(తెరలో హాహాకారము వినఁబడును.)

భరత:—ఓయీ !

గీ. అయ్యో ! ఆకస్మికముగ సౌధాగ్రసీమ
నేఁగుదెంచెడియీధ్వని యేరి దొక్కొ
డేగ టెక్కలతాఁకున డీలు వడిన
యట్టికురరీనినాదంబు ననుకరించె. ౨౩

ఈశబ్ద మెవరిదో తెలిసికొనిరమ్ము —

కాంచుకీయుఁడు:—చిత్తము.

(పోయి తెలిసికొనివచ్చి)

పూజ్యురా లగునంగారవతీదేవి వాసవదత్తాపహారణంబు వలని శోకాతిరేకంబున సంతప్తస్వాంతయై ప్రాసాదంబునుండి పడియేనిఁ ప్రాణంబులు బాయఁ దలంచినపుడు మహారాజు

లుంగా రీతీరుగాఁ బలికెరి. దేవీ! ఏటి కొసంతో మనమయం బున సంతాప మందెదవు? భవదీయతనుజాతకు క్షత్త్రియోచితం బగుగాంధర్వవివాహ మితఃపూర్వంబె నిర్వర్తింబయ్యె. కావున మన మిప్పుడు ఫలకస్థితు లగువాసవదత్తావత్సభూపతులకు వివాహ మాచరింతుముగాక అని. అందువలన అచ్చట

గీ. కంటఁ దడిలోడ మోములఁ గౌతుకంబు
గాన రాకుండఁ బనుల సాకస్మికముగ
మంగళద్రవ్యములు సెలగంగ నిపుడు
చేయుచున్నారు కౌతుకశీలు స్త్రీలు. ౬౩

యౌగం:—అట్లని మాతేనితో మహాసేనమహారాజులు వియ్యమందఁ దలఁచుచున్నారు గాన భృంగార మిటు గొనిరమ్ము.

కాంచుకీయుఁడు:—ఇదిగో. చేకొనుఁడు (దగ్గఱకుఁగొనిపోవును.)

భరత:—యౌగంధరాయణా! మహాసేనుఁడు మీ కింతకంటె మఱల నేమి ప్రియంబు గావింపవలయును?

యౌగం:—మహాసేనుండు నాయందుఁ బ్రసన్నుఁ డేని నా కింతకంటెఁ గావలసినది యే మున్నది?

[ భరతవాక్యము ]

గీ. గోవులకు వ్యసనము లేక పోవుఁ గాత
శాంతిఁ జెందుత మఱి పరచక్రమెల్ల
ఈచతుర్వార్ధి సహిత మహీతలంబు
నెపుడు మారాజసింహుఁడే యేలుఁ గాత.

[ అందఱు నిష్క్రమింతురు. ]

ఇది చతుర్థాంకము.

కవిశేఖర శతావధాని పల్లె పూర్ణప్రజ్ఞాచార్యాంధ్రీకృతం
బగుప్రతిజ్ఞాయౌగంధరాయణంబు
స మా ప్త ము.

ద్వితీయాంకము

మహాసేనుడగు ప్రద్యోతుడు దేవితోకూడ తన కన్య యగు వాసవదత్త వివాహమునుగూర్చి ప్రస్తావించుకొనుచుండును. వత్సరాజు పట్టుబడినవార్త వచ్చినది. మహాసేనుని హర్షమునకు మేరలేదు. కారణము యౌగంధరాయణుడు బ్రదికియుండగా తాను వత్సరాజును పట్టింపగలుగుటయే. పైగా జయచిహ్నముగా వత్సరాజు వీణ ఘోషవతిమహాసేనునికి లభించినది. అది వాసవదత్తకు నిర్దేశింపబడినది.

వత్సరాజునకు వ్రణచికిత్స, కారాగారమున సౌఖ్యప్రాప్తి మహాసేనుడాదేశించును. వత్సరాజు వీరగుణములు శత్రుసేనినియు ఆకర్షింపజాలునవి.

తృతీయాంకము

వెఱ్ఱిబిచ్చగాడొకడు మహాసేనుని పురమువీధులలో దిరుగుచున్నాడు. వానివెంట హేళనచేయుటకై కొందఱు గూడినారు. తన తినుబండారముల నెవరో యెత్తుకొనిపోయినట్లు, తన్నుకూడ యెత్తికొనిపో జూచుచున్నట్లు పిచ్చివాని పాటలు వినిపించును. శ్రమణకుడొకడు పైకి తగవులాడుకొనుచున్నట్లున్న విదూషకునకును ఉన్మత్తునికిని తోడయినాడు.

సమయముజూచి ముగ్గురును ఒక నిర్జనప్రదేశమున జేరుదురు. యౌగంధరాయణుడు రుమణ్వంతుడను మంత్రికిని, వసంతకుడను పరిచారకునికిని తన పన్నాగములు సూచించును. నలాగిరి మహాసేనుని భద్రగజము. దానికి మత్తుగల్పించిరి. అది విచ్చలవిడిగా నూరిపై బడును. విధిలేక మహాసేనుడు వీణనిచ్చి వత్సరాజును దానిని వశపఱచుకొనుటకై విడిపించును. ఊరంతయు వత్సరాజుసైనికులు మాఱువేసములతో తిరుగుచుండిరి. మహాసేనుని పరిచారకవర్గమునకూడ దూరిరి.

కాని తానెఱిగినసంగతి వసంతకుడు చెప్పుచున్నాడు. కారా

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము

## గ్రంథపరిచయము



భాసుడు సంస్కృతభాషలో పదుమూడు నాటకములు రచించియున్నాడు. ఇతరకవులు దీర్ఘనాటకములు రచించిరి కాని భాసుడు సంగ్రహముగా రంగస్థల ప్రయోగార్థముగా తన నాటకములు రచించినాడు. ఆఱు భారతకథకు సంబంధించినవి. రెండు రామాయణమును నాధారము చేసికొన్నవి. ఒకటి శ్రీకృష్ణ చరితము. రెండు కల్పితవస్తువులు. రెండు ఉదయనుని కథను చిత్రించునవి.

ఉదయనికథ ఆనాడు జనులు చెప్పుకొను చుండువారు. బృహత్కథ యనుగ్రంథమున ఉదయనుని వృత్తాంతము వచ్చును. వత్సరాజనగా ఉదయనుడే. వాసవదత్తతండ్రియగు మహాసేనునిచే వంచనపద్ధతిని బంధింపబడి, మంత్రియగు యౌగంధరాయణునిచే విడిపింపబడుటయు, బందీయైయున్న సమయముననే వాసవదత్తను జూచుట, ఆమెకు సంగీతము నేర్పుట, ఆమెను రాక్షస వివాహమున తీసికొనిపోవుట ప్రతిజ్ఞాయౌగంధరాయణమందలి కథ. ఇక్కథకు ఉత్తరకథ స్వప్నవాసవదత్త. రామాయణమునకును, ఉత్తర రామాయణమునకు గలసంబంధమీ రెండింటికినిగలదు. పద్మావతియను మరొక నాయికను వత్సరాజు పెండ్లాడుట అందలి యితివృత్తము. అందు వాసవదత్త స్వార్థత్యాగము ద్వితీయా నాయికాగ్రహణమున కాధారమైనది.

ప్రస్తుత నాటకమున ఫలము వాసవదత్తా వత్సరాజుల వివాహమయ్యును, వత్సరాజు రంగస్థలమున నగుపింపడు. వాసవదత్తయు కనుపింపదు. మఱి కనుపించునది మహామంత్రియగు

యౌగంధరాయణుని క్షేముషీ విశేషము, వినిపించునవి ఆతని ప్రతిజ్ఞలు—కావుననే యీ నాటకమునకు ప్రతిజ్ఞాయౌగంధరాయణమని పేరువచ్చినది.

## కథాసారము

ప్రథమాంకము

వత్సరాజు వేటకై వెడలినాడు. దూరదర్శియగు యౌగంధరాయణుడు రాచనగరుననే యున్నాడు. రాజునకు శత్రువగు మహాసేనునివల్ల అనర్థము శంకించును. మహాసేనుని మోసమును పసిబట్టివేసినాడు. కాని రాజా మోసమునకు గుఱికాకుండ సేవకుని ద్వారా రాజును హెచ్చరించుచు లేఖయు, అంతఃపురమువారి శుభాశంసనములతోటి రక్షాసూత్రమును అంపించును.

కాని అవియందకమునుపే రాజు పట్టువడెనన్నవార్త వినవచ్చినది. మాయానీలగజమున సేననునింపి వత్సరాజు దగిసినప్పుడు వానిపై నురికించి, మహాసేనుడు మోసముచే రాజును బట్టెనట. కాని పోరుచు మహారాజు మూర్ఛిల్లెనట. స్కంధశయనముపై నుజ్జయినికి గొనిపోయిరట. బుద్ధిమంతుడగు యౌగంధరాయణుడు అంతఃపురమునకీ యుదంతమును 'చల్లగా' చేర్చును.

ఒకప్రక్కన యౌగంధరాయణునకు చింతతో ప్రతీకారచింతయు నధికమగుచున్నది. రాజమాత యౌగంధరాయణునే నమ్ముకొన్నది. యౌగంధరాయణుడు రాజును విడిపింపలేనిచో మారుపేరున పిలువుడని ప్రతిజ్ఞపట్టును.

రాజునకు పట్టిన దుర్విధిని శాంతింపజేయు సంతర్పణమున భగవానుడు బాదరాయణుడు ఉన్మత్తవేషధారియై వచ్చెను. తన దుస్తులను విడిచిపోయెను. అది సంకేతముగా యౌగంధరాయణు డున్మత్తవేషముధరించి, రాజును విడిపించుటకై శత్రుపట్టణమున సంచరింపవలయును.

ద్వితీయాంకము

మహాసేనుడగు ప్రద్యోతుడు దేవితోకూడ తన కన్య యగు వాసవదత్త వివాహమునుగూర్చి ప్రస్తావించుకొనుచుండును. వత్సరాజు పట్టుబడినవార్త వచ్చినది. మహాసేనుని హర్షమునకు మేరలేదు. కారణము యౌగంధరాయణుడు బ్రదికియుండగా తాను వత్సరాజును పట్టింపగలుగుటయే. పైగా జయచిహ్నముగా వత్సరాజు వీణ ఘోషవతిమహాసేనునికి లభించినది. అది వాసవదత్తకు నిర్దేశింపబడినది.

వత్సరాజునకు వ్రణచికిత్స, కారాగారమున సౌఖ్యప్రాప్తి మహాసేనుడాదేశించును. వత్సరాజు వీరగుణములు శత్రుసేనియు ఆకర్షింపజాలునవి.

తృతీయాంకము

వెఱ్ఱిబిచ్చగాడొకడు మహాసేనుని పురమువీధులలో దిరుగుచున్నాడు. వానివెంట హేళనచేయుటకై కొందఱు గూడినారు. తన తినుబండారముల నెవరో యెత్తుకొనిపోయినట్లు, తన్నుకూడ యెత్తికొనిపో జూచుచున్నట్లు పిచ్చివాని పాటలు వినిపించును. శ్రమణకుడొకడు పైకి తగవులాడుకొనుచున్నట్లున్న విదూషకునకును ఉన్మత్తునికిని తోడయినాడు.

సమయముజూచి ముగ్గురును ఒక నిర్జనప్రదేశమున జేరుదురు. యౌగంధరాయణుడు రుమణ్వంతుడను మంత్రికిని, వసంతకుడను పరిచారకునికిని తన పన్నాగములు సూచించును. నలాగిరి మహాసేనుని భద్రగజము. దానికి మత్తుగల్పించిరి. అది విచ్చలవిడిగా నూరిపై బడును. విధిలేక మహాసేనుడు వీణనిచ్చి వత్సరాజును దానిని వశపఱచుకొనుటకై విడిపించును. ఊరంతయు వత్సరాజుసైనికులు మారువేసములతో తిరుగుచుండిరి. మహాసేనుని పరిచారకవర్గమునకూడ దూరిరి.

కాని తానెఱిగినసంగతి వసంతకుడు చెప్పుచున్నాడు. కారా

గారవు ఎదుటివీధిలోగుండా వాసవదత్త దేవ్యాలయమునకు పోవుచున్నది. బోయీలు బుజములు మార్చుకొనుటకై పల్లకినాపిరి. కన్నియగావున పల్లకికి తెరలులేవు. ముంగిటనున్న వత్సరాజు వాసవదత్తను చూచినాడు.

యౌగంధరాయణు డాలోచనలోపడినాడు. రెండవ ప్రతిజ్ఞ చేయుచున్నాడు. అర్జునుడు సుభద్రనువలె రాజు వాసవదత్త నపహరించుకొనిపోవునట్లు చేయవలెను. అదియును మరుచటిదినమేనట.

త్వరితగతిని ప్రయత్నములుజరుగవలె. మారువేసముననున్న వారు విడిపోయిరి. మరల పిచ్చివాడు సాభిప్రాయముగా పాటలు పాడును.

చతుర్థాంకము

రాకుమారి జలక్రీడకై పోవలయునట. భద్రవతియను నేనుగు రావలయును. అదియు గనుపింపదు. దాని పరిచారకుడు త్రావినాడు. త్రావుటయేకాక ఏనుగును తాకట్టుపెట్టినాడు డబ్బులేక కల్లంగడిదానివద్ద.

మహాసేనుని భటులకు మతిపోవుచున్నది. యుద్ధము జరుగుచున్నది. యౌగంధరాయణుడును ఆయుధముపట్టినాడు. ఎక్కడ జూచినను వాని మనుష్యులే. కాని యౌగంధరాయణుని కత్తి జారిపోయినది. మహావీరుడగు మంత్రి పట్టుబడినాడు. కాని యాతని బుద్ధివంచింప శక్యముగానిది. నళాగిరినెక్కి వత్సరాజు వాసవదత్తతో పారిపోయినాడన్న నిశ్చయ మాతనికి గలదు. భటులు నళాగిరిని వెన్నంటి వత్సరాజును పట్టుకొనిరన్న వార్త నాతడు నమ్మడు.

యౌగంధరాయణు నాయుధాగారమున బంధించినారు. శత్రు మంత్రియగు భరతరోహకుడు వచ్చును. అన్యాయమున వాసవదత్తను అపహరించిరని అధిక్షేపించును. కృతఘ్న లక్షణ

మనును. అన్నిటికిని సమాధానములు చెప్పి యౌగంధరాయణు డాయా చేష్టితములను సమర్థించును.

యౌగంధరాయణుడు మరణదండనకును సిద్ధమే కాని ఇంతలో వాసవదత్తా వత్సభూపతుల చిత్రఫలములకు మహాసేనుడు వివాహ మాచరింపఁజేయును. దేవి నొప్పించును. యౌగంధరాయణుని సత్కరించిరి.

నాంది

నాటకప్రయోగము నిర్విఘ్నముగా సాగుటకై చేయు దేవతాస్తుతి. పదములసంఖ్యకు కొన్నికొన్ని నియమములను సంస్కృత నాటకలాక్షిణికులు ఏర్పరచిరి. ఇందు కేవలము దైవస్తుతియేగాక కథకూడ సూచింపబడవలయును. (Forecast)

సూత్రధారుడు

నాట్యానుష్ఠానమునకు సూత్రమని పేరు. అట్టి సూత్రమును ధరించువాడు సూత్రధారుడందురు. ఇతడే నాందీస్తోత్రమును పఠించును. ఇతడు రంగవిధులను బాగుగా తెలిసినవాడై ఉండవలయును. ప్రస్తుతకాలపు "డైరెక్టరు" వంటివాడన్నమాట.
యుగంధరుడు = శివుడు; యౌగంధరాయణుడు = కుమారస్వామి

దేవతల సేనానియగుటచే మహాసేనుడు వాసవునికి (ఇంద్రునికి) స్వర్గరాజునకు తారకాసురభయము బాపి శుభమును చేకూర్చినవాడు. పిన్నవాడగు యువరాజ వత్సరాజని పేరుగలండు. శక్తిధరుడగుటచే కుమారస్వామి స్తోత్రమీ పద్యమున కావింపబడినది. నాటకీయపాత్రలు మహాసేనుడు, వత్సరాజు యౌగంధరాయణుడు- వీరి పేర్లను ముఖ్యముగా అవార్యశక్తిరాజితుండను యౌగంధరాయణుని విశేషణమును నాటకకథను సూచించును.

నటి

సూత్రధారుని ప్రియురాలు.

సూత్రధారుడు నటితోనో, మరి ఇతర బంధువుతోనో నాటకమునుగూర్చియు, తత్కవినిగుఱించియు, (సభ్యుల ఆనందమునకై ఏదేని ఋతువునుగూర్చి గానముచేయుటయు) ప్రస్తావన యని పేరు. దీనికి ఆముఖము, స్థాపన యని పేళ్లుగూడగలవు.

ఈ స్థాపనయను దాని చివర పాత్రప్రవేశముకూడ చమత్కారముగా సూచించు నాచారము కలదు. 'అదిగో' యని కథకుసంబంధించిన పాత్రను నిర్దేశించుటకు ప్రయోగాతిశయమని పేరు. ప్రవృత్తకము. కథోద్ఘాతము

[ఇందలి అంకెలు పుటలను తెల్పును. పద్యసంఖ్యలు ప్రత్యేకముగా సూచింపబడును.]

## ప్ర థ మాం క ము

పుట 1. నాటకప్రయోగము:- ఈ పదము సామాన్యార్థమున వాడినది. మూలమున 'ప్రకరణము' అను పదము కలదు. అదియును సామాన్యార్థమున వాడినదే.

పుట 2. (పద్యం 3) చెద్దు (చెయిది) = కార్యము; సత్కారనిరతులు—మూలమునందు 'యోవా విజ్ఞాతా సత్కృతానాం గుణానాం' అని యున్నది. అనగా సత్కార్యముల ఫలితము లెఱుంగువాడు అని యర్థము.

లేఖయేగదా నన్నుఁబోనీయకున్నది — తమరిత్తుమన్న లేఖ యింకను ఇవ్వలేదుగాని యీపాటికే నేను ప్రయాణమగుటకు సిద్ధముగానే ఉన్నాను.

పుట 3. రక్షాసూత్రము:- దురదృష్టవశమున బడకుండ పెద్దలును, హితాభిలాషులనుపంపునట్టి త్రాడు. అదికూడ రాజునకై ఉద్దేశించినదే.

వనగజప్రచ్ఛాదితశరీరంబగు నీలగజంబు—అనేక వనగజలమధ్య సాయుధ సైనికులతో నిండిన కల్పిత గజమునుంచి, టకై వచ్చువానిని భ్రమపెట్టి, సమీపమునకు రానిచ్చిపట్టుటకై పన్నిన ఉపాయము.

(4 ప.) చలమున = మోసముచే; వీడి యుద్ధవార్తలు = యుద్ధముసేయు తలంపుమాని అని కవిహృదయము; బలమెంత యున్న ననురాగము లేనియెడఁగళత్రమూ = ఎంత సేనయున్నను రాజభక్తిలేనిచో కళత్రము (భార్య) వలె బలహీనమై నది యగును.

సర్వాంతఃపురజనంబుల హస్తంబులనుండి తొందరింప బడు చున్నది—అంతఃపురమునందలి అందరు దేవులును తమ తమ హస్తములనుండి తీసి తొందరగా రాజు శుభమునకై రక్షాసూత్రములను పంపుచున్నారని అభిప్రాయము; సర్వాంతఃపుర వధూకరస్పృష్టంబుగాని వేరొండుగాని = అందరి సూత్రములయినను సరే ఒక్కటియైనను సరే, ఎదో తొందరగా కావలయునని భావము.

పుట 4. హంసకుఁడొక్కఁడే వచ్చెననియా (నీవు పలుకుచున్నావు) అని వాక్యమును పూరించుకొన వలయును; లేదేని విశ్రాంతినైనను పొందవచ్చును = కొంచెము సేపు విశ్రమించి పోవచ్చును.

(5 ప.) ఇతర ప్రదేశములకేగి చాలాకాలమున కింటికి తిరిగివచ్చువాని మనస్సు ఏరీతిగా మంచియే విందునో, చెడ్డయే విందునో యని శంకించునో అట్లే నామనస్సును.

అవినాకృతుడు = విడిపోయినవాడు; ఎచ్చటనున్నా రెచ్చట నున్నారు—అని ద్విరుక్తి. ఆత్రతను దెల్పును.

పుట 5. ప్రేషణము = పంపుట; ఒకపాటి ఆపదగల్గినట్లు—జీవించి యున్నారనియే చెప్పెనుగాని క్షేమముగా నున్నాడని చెప్పకున్నందున బుద్ధిమంతుడగు మంత్రి ఇట్లూహించుచున్నాడు.

(6 ప.) స్వామిభక్తి, స్నేహము, కులీనత దేహపరిశ్రమచే బలము, సద్గుణములు, సత్ప్రవర్తన—ఇట్టి గుణములుగల ఆశ్వికులు లంచము గ్రహించి శత్రుసేనలో కలిసిపోయిరా? దట్టమగు అడవిలో తెన్నుగానక చెల్లాచెదరైరా? శత్రుసేనల నెదుర్కొనలే నష్టపడిరా! ఏమి కారణమోగాని రాజును రక్షింప లేకపో-

పుట 6. హయసుఖదాయకము = గుఱ్ఱముపై స్వారిచేయుటకు అనువగునది; కించిదవశిష్ట = కొద్దిమిగులుకల; నిజకళత్రము = తనభార్య; ఆతపత్రమాత్ర పరిచ్ఛదుండు = గొడుగొక్కటియే తలదాచుకొనుట కున్నవాడై; గజమృగయార్హంబు = ఏనుగులను వేటాడుటకు తగిన; అమ్ము వేటుదూరము = బాణము వదలిన ఎంతదూరముపోవునో అంతదూరము; తటాకపంక + ఉత్థితము = చెఱువులోని బురదనుండి లేవనెత్తబడినది; అర్ధనిర్మిత మనశ్శిలా లేపంబు = సగముచెక్కిన రాతి విగ్రహమువలె గొగ్గులశరీరము కలదని భావము; భీమదర్శనము = చూచుటకు భయంకరమైనది; యూథము = సమూహము; ఒక్క + ఎడ = ఒక్కచోట; ఈఅనర్థంబునకు మూలకందముగు నొకభటుండు—ఆ భటుని ప్రేరణము వల్లనే రాజు పట్టుపడుట యను ఆపద కల్గినది గనుక; మల్లికా లతాచ్ఛాదితము = మల్లెతీవలతో కప్పబడినది; నఖదంత శూన్యంబుగ = గోళ్ళు దంతములు లేనిది; ఏకనీలము = పూర్తిగా నల్లనిరంగుగల; జాగ్రదవస్థ = మేలుకొనియున్న స్థితి.

పుట 7. నృశంసుడు = క్రూరుడు; పసదనము = కానుక; హస్తిశిక్ష = ఏనుగులకు సంబంధించిన శాస్త్రము; నీలకువలయతనువు = నల్లకలువ రంగుగల శరీరము కలది; గజసార్వభౌమము = శ్రేష్ఠమగు ఏనుగు; అప్రమత్తులరు = మెలకువతో నున్నవారు; వీణామాత్ర ద్వితీయుడను = ఒక్క వీణయే సహాయముగా గలవాడనై; ఉపేక్షించు = ఏమియుచేయక ఉండుట; ఐరావణము = ఇంద్రుని గజమగు ఐరావతము; దిగ్గజ గ్రహణంబును దేవరవారిపట్ల నుపపన్నంబ = దిక్కులను మోయుచున్న ఏనుగులనుకూడ ప్రభువులగు తమరు పట్టుకొనుటకు సమర్థులగు అని భావము; రక్షణకశక్యంబు... యుండును = ఇతర దేశములయందు కాపుదలపెట్టుట మనకు సాధ్యము కాదు కనుక, ఆపదలుకూడ అట్టిచోట్ల వెంటనే సంభవును; నిర్లజ్జులు = మోసగించుట సిగ్గుచేటుగా తలచనివారని [illegible]; దుష్కులీనులు = హీనకులములందు పుట్టినవారు; సమ

గ్రసైన్యము = సంపూర్ణమగు సేన; గజయూథయోగ్య పదాతి వర్గము = ఏనుగులగుంపును (పట్టుకొనుటకై) వలసినంతమంది కాల్బంటుల సమూహము; మహాజన సమక్షము = అందరియెదుట; అందరిఎదుటను చెప్పుటకును చాటుగా చెప్పుటకును భేదముకలదు. చాటుచేసి చెప్పినచో అందు మోసపుతలంపు లుండవచ్చును. నిర్దుష్టము = దోషరహితము; నీలవలాహకము = (నల్లని మేఘము వంటి ఆకారము కలదని యభిప్రాయము); అంబరమణి = ఆకాశమున మణివలె వెలుగు సూర్యుడు; వంచనోద్యమము = మోసగింపుఁ బ్రయత్నము.

8 పుట. ద్విగుణమాత్రంబుగ— (మూలమునందు "ద్విగుణమివఅధ్వానం" అని కలదు) మార్గము ప్రయాణమునకు అనుకూలముగా నుండకపోవుటచే దూరము రెట్టింపువలె నున్నది అని భావము. వృక్షసావర్ణ్యంబున = నల్లని సాలవృక్షమురంగు— ఏనుగురంగును ఒకదానితో కలిసిపోయి, ఏది చెట్టో, ఏది ఏనుగో పేర్పరించుటకు వీలులేకుండెను. అశరీర నిక్షిప్తము = ఆకాశమే అక్కడపెట్టినట్లున్న; దివ్యవారణ ప్రతికృతి = దేవతల ఏనుగగు ఐరావతము ప్రతిబింబమువలెనున్న; మాసంతాపాకృతి—రాజు పట్టువడుట మాకు దుఃఖహేతువు. రాజు పట్టువడుటకు కారణమా నీలగజము. కావున నీలగజమే దుఃఖకారణము. మాదుఃఖమే ఆకారముదాల్చి ఆగజమైనట్లున్నది—గజముయొక్క రూపమును మరియొకటిగా దుఃఖముగానున్న మంత్రి భావించుచున్నాడు; గజనిశ్చయంబునంబోలె నొక కంఠీరవంబు = ఏనుగును గుఱిచూచి ఉఱుకబోవునది వలెనున్న ఒక సింహము; అన్వేషణము = వెదకుట; మహామాత్రప్రధానాయుధీయులు = మహామాత్రుడే సేనాని గల ఆయుధములనుధరించిన బటులు; (ప్రధానమంత్రి); సత్కులప్రసూతులు—రాజభటులను మంచికులమందుపుట్టినవారినే ఎన్నుకొనవలయునని రాజనీతి; నామగోత్రపురస్సరముగా— పేరు, వంశము ముందు తెలిపి; విషమము = సమముకానిది, హానికారకము;

ఛలప్రయోగము = మోసపుటెత్తు; సమంబొనర్తు = ప్రతీకారము చేసి అందలి ఆపదను తొలగింతును.

(8 ప.) శత్రువుపన్నినవలలోపడితినిగదాయని రాజుసిగ్గుచెందెను. ఎంత బలముగలవాడయినను, అభిమానముగలవాడయినను ఒంటరిగా శత్రుసమీపముననున్నవాడగుటచే శత్రుసేనల లోనికిచొచ్చుకొని పోవును.

పుట 9. ఆత్మాభిప్రాయానువర్తి—వాహనములగుగుఱ్ఱములకు, ఏనుగులకు, తమ అధిపతి ఉద్దేశమును గ్రహించి, దాని కనుకూలముగాచరించు నేర్పుఉండును;తనమనంబుననున్నంతకన్నమిన్నగ = అనుకొన్నదానికన్న అధికముగా; పరబలము = శత్రుసేన; బహుళము = అధికము; కాయక్లేశము = శరీరకష్టము; విషణ్ణ నష్ట సకలపరివారుండు = నిరాశచేసికొని పారిపోయిన అనుచరలు కలవాడై; కాదు కాదు—ఆత్మస్తుతికి మనసొప్పక హంసకుడిట్లు పలుకుచున్నాడు; ఆలము = యుద్ధము; కర్కశవల్లరులు = త్రెంపుకోరానంత గట్టితీవలు.

(9 ప.) మాంసల = కండలుగల, అత్యంత + ఉన్నత = మిక్కిలి ఎగువయిన; అంసద్వయము = రెండు బుజము మూపులు; వ్యాయామ సుదృఢపర్వములు = కసరతుచేయుటచేత మిక్కిలి దిటవైన సంధులు; నాగేంద్రహస్తంబు నగెడునాకృతి = శ్రేష్ఠమగు ఏనుగు తొండమును పరిహసించునట్టి ఆకారము; దీర్ఘవర్తులత్వములు—బాహువుల నిడివి, గుండ్రదనము—మహానుభావులగు పరాక్రమవంతుల లక్షణములు; చాపసంస్ఫాలన శస్త్రహస్తములు = వింటిని ఎక్కుపెట్టుటచే పొగడ్తకెక్కిన చేతులు; ఆలింగనములచేత—స్నేహితులను ఆలింగనముచేసికొనునట్టివని మూలము.

పుట 10. శరీరమే పరిభూతంబయ్యెగాని తేజంబుగాదు—మూర్ఛలోనుండుటచే శత్రువులు చేయు బంధనపరాభవము రాజుకు తెలియదు. అందువలన అతనిబుద్ధికి పరాభవ మొనరించు

చున్నట్లు తెలియునే తెలియదు; బన్నమొనరించె = చంపెను; ఉసురులం బాయం జేయుట = ప్రాణములను పోగొట్టుట; చక్కాడు = సంహరించు; దుర్గతిపాత్రుడు = దురవస్థ పాల్పడినవాడు; వేఱొకతీరున ప్రభువుగారి విక్రమమునే అభివర్ణించుచు = తమ తమ బందుగులు పడినపాట్లు కసికొలది తెలుపునపుడు రాజు ఇంత మందిని ఈవిధముగా సంహరించెనుగదా యని వినువారల కర్థమగునని భావము. అకార్యంబు = చేయరానిపని; ఒడిగట్టుట = సిద్ధపడుట; దక్షిణాభిముఖు నొనర్చి = దక్షిణపు దిక్కునకు ముఖమును త్రిప్పి (యమునిదిక్కునకు త్రిప్పినచో చచ్చిపోవువాడని సూచించుచు); కదనవ్యాపారము = యుద్ధక్రియ; నిరుపచారముగా = గౌరవము లేకుండా; ఉసి = ప్రేరణము, ఉత్సాహము; అంతలో నేను తెప్పరిల్లుదును—యౌగంధరాయణు డీమాటలు వినలేకపోవు చున్నాడన్నమాట; రక్తప్రవాహ పంకిలము = నెత్తుటి కాలువలచే బురదబురదయైన.

పుట 11. ప్రతిహత + ఆరంభుడై = భంగము కావింపబడిన ప్రయత్నము కలవాడు; మిత్తి = మృత్యువు.

(10 ప.) శత్రువులపాలు కాకుండ, ధర్మము చెడకుండ పాలింపబడు భూమి, ఆపదలయందు తిరిగి రాజును రక్షించును. ఇచ్చట చంపబోవు క్రూరుడు భూమిపై కాలుజారిపడి తనంతటఁ జచ్చెను.

తొలుదొల్తనే— రాజు మూర్ఛిల్లకముందు అమాత్య శాలంకాయనుని పడగొట్టెను; తత్కాలదుర్లభము—బంధనములోనున్న రాజునకు నమస్కారముచేయు శత్రువుండుట అస్వాభావికము గనుక; దురవస్థ శత్రునేనియు మిత్రకార్యంబునకుఁ బురికొల్పునుగదా!—సాటిరాజు, క్రూరముగా అడవితీవలచే బంధింపబడియుండుట, దుర్మార్గులచే వధింపబడనుండుట ఇట్టి అకార్యములు శత్రువునకును జాలి పుట్టించినవి; వ్యసనము — దుఃఖము;

స్కంధశయనము—భుజములపై మోచికొనిపోవుటకు వీలయిన యానము (Stretcher వంటిది)

పుట 12.(12ప.) సువాక్యే యెప్డు విస్వినులక్—మూలమునందు 'సిద్ధవాక్యః' అని కలదు—తనమాట కెదురులేనివాడని తాత్పర్యము; నమ్రుడౌగా......ధిక్కారమో = బంధింప బడినవాడు గౌరవము నందినను, తిరస్కారింపబడినను లొంగియే యుండును గదా! (మూలమున 'ప్రణిపతతి నిరుద్ధః సత్కృతో ధర్షితో వా' అని కలదు.)

(13 ప.) వితగ = వృధాగా; ప్రతిసరములు = రక్షాసూత్రములు—యుద్ధమునకు పోవుటకు ముందుగా గుఱ్ఱములకు హారతులిచ్చి విజయమంగళములు గావించు ఆచారము కలదు. యుద్ధము ముగిసిన వెనుక ఎవ్వరును కావింపరు.

పుట 13. నీవు విజయవు కదా?—ఎన్నియో పనులందు ఎంతో ధైర్యము, తెలివి చూపినదానవు. ఇప్పుడు అధైర్య పడుచుంటివని హెచ్చరించుట; మందభాగ్యురాలను—రాజమాతకు రాజు బంధితుడను దుఃఖవార్తను చెప్పవలసి వచ్చుటచేత; స్నేహదుర్బలంబగు ......రక్షింపవలయు—పుత్రవాత్సల్యముగల రాజమాతగుండె పగిలి పోకుండ, చాకచక్యముగా ఆమెను కాపాడవలయును.

(14 ప.) మునుమున్న యుద్ధము అనర్థములతో కూడినదని చెప్పవలయును. అప్పుడామె యుద్ధమునకుపోయిన తనకుమారుని కేమేని అశుభము వాటిల్లెనేమో అని శంకించును. తరువాత నేర్పుతో చల్లగా రాజు పట్టుబడినవిధము నెఱింగింపవలయును.

పుట 14. అంతర్బాష్ప + ఆకలితలోచనంబులతో = కనుగ్రుడ్డులయందు నీరు కూడుకొనగా; ఊంకించు = ప్రయత్నించు; స్తంభితకంఠుడు = మాట కంఠమునందే అణగిపోయినవాడు; పేరితో పిల్చుచుంటివని—రాజు తనమాటలలో 'యౌగంధరాయణుని చూడుము' అని చెప్పెను. ఆమాటలనే సేవకుడు చెప్పుచు,

మర్యాదా సూచకమగు 'ఆర్య' మొదలగుపదములు లేకుండ 'యౌగంధరాయణ' పద ముచ్చరించుటకు వెనుకాడుచున్నాడు; అదూరదర్శి—దీర్ఘదృష్టి లేనివాడు.

పుట 15. (15 ప.) మోసగించుచో = మోసగించినతరువాత ('వంచయిత్వా' అని మూలము); స్థిర నిజరాజ్య వైభవము... పార్శ్వమందునో = శత్రుభయము లేకుండ తనరాజ్యమును తాను సంపాదించుకొనగా; గౌరవముతో మంత్రిపదవియందు నేనుందునని భావము,

(16 ప.) అంతఃపుర స్త్రీలీవిధముగా తమదుఃఖమును ప్రకటించుచున్నారు. ఇది మంత్రులు తమ శక్తిరహితులని చెప్పుచున్నట్లు భావింపదగినది. ఇందు 'వర' యను పదము సరియైనది కాదు.

వైర నిర్యాతనము = పగ తీర్చుకొనుట; నిర్విణ్ణుడు = ఖిన్నుడు, ఖేదము పొందువాడు.

పుట 16. పుత్రకా—ఈ పదమువలన రాజమాతకు యౌగంధరాయణునియెడల వాత్సల్యము తెలియనగును. సంభావనను బహూకరింతును = నాయందుగల సదుద్దేశమునకు తగినట్లు ఆచరింతును; నీరముగొనిరమ్ము—ప్రతిజ్ఞ ఉదకమును స్పృశించి చేయును.

(17 ప.) ద్విజరాజు = నక్షత్రములకు ప్రభువు–చంద్రుడు; పెద్దగా = బిగ్గరగా.

పుట 17. పనితీరుపై = కావలెనని; భగవానుడగు బాదరాయణుడు ... దీనివలన యౌగంధరాయణుని మునిభక్తియు దైవభక్తియు వెల్లడియగుచున్నవి—సర్వకాల జీవులగు మునులలో బాదరాయణు డొకడు.

పుట 18. తతిన్ = (సరియగు)సమయమునకు.

## ద్వితీయాంకము

పుట 19. ప్రతీహారరక్షకుడు = ద్వారపాలకుడు; ప్రతీహారి; అతిథేయుడు = ఆతిథ్య మివ్వదగినవాడు; గోత్ర + అనుకూలములు = వంశమునకు సరిపోయినవి; దైవమేసమర్థంబు = మానవ ప్రయత్న మెంతయున్నను అదృష్టమే బలీయము.

(20 ప.) రాఁడు + అవున్ = రాలేదు కాబోలును; కదంబము = సమూహము; వరప్రతీక్షుడయ్యున్ = పెండ్లికుమారుని వెదకుచున్న వాడయినప్పటికిని.

పుట 20. అందంద = అక్కడక్కడనే; రాజులు తిరుగునప్పుడు సేవకులు దూరదూరముగానుందురు.

(21 ప.) దట్టముగానున్న గడ్డిపోచలవలె నున్ననైన నీలాలతో ప్రకాశించుచున్న పసుపుపచ్చని దండ కడియములుగల ఎత్తైన బుజాల మూపులుగలరాజు, (రెల్లు పొదనుండి బయటికి వచ్చు కుమారస్వామివలె) బంగారు తాడిచెట్ల తోపునుండి వెడలి వచ్చుచున్నాడు.

మహాసేనుడనగా కుమారస్వామియను నర్థము నాందీపద్యమున సూచింపబడినది.

(22 ప.) ఇతర రాజలందఱును సేవకులవలె నా గుఱ్ఱము వల్ల రేగినధూళిని శిరసా వహింతురు కాని ఆ గొప్పతనము నాకు సంతోషమును కల్గించదు. ఏలన హస్తిశిక్షా విశారదుడును గొప్పగుణములు కలవాడునగు వత్సరాజు నాకు నమస్కారమే చేయడు.

పుట 21. నిరీక్షించు = ఎదురుచూచు; ప్రత్యహము = ప్రతిదినము; అతిలోభము = పెద్దఆశ.

(23 ప.) మున్ముందుగా వరుడు మంచికులమందు పుట్టినవాడుగా నుండవలయును. తరువాత దయాగుణ ముండవలెను. దయ మెత్తనిగుణ మైనప్పటికిని గొప్పగుణములలో నొక్కటి. ఆ పైని చక్కని రూపకాంతి వాంఛనీయము. ఇట్టి గుణములు

కావలయునను ఆస స్త్రీలకొరకేసునూ. తర్వాతవలసినది బలము. బలహీనుడు భూమినెట్లు పాలింపగలడు. స్త్రీల కెట్లు సుఖము చేకూర్పగలడు?

(24 ప.) ప్రాక్కృతంబగు సుకృతంబు = పూర్వ (జన్మ) మునందు చేసినపుణ్యము.

పుట 22. దుఃఖశీలలు — దుఃఖించు స్వభావము కలవారు; వైతాళిక - స్తోత్రము, మేలుకొలుపు మాటలు మొదలగునవి పఠించునది; మహతి = ఒకానొకవిధమగు వీణె; గాంధర్వము - సంతోషము.

పుట 23. భర్తయే వీణను నేర్పునులెమ్ము—రాబోవు విషయము తలవనితలంపుగా నోటివెంట వచ్చినది (Unconscious Dramatic Irony) ; అనురూపవరుడు = తగినభర్త; ఉపరోధించు = ఒత్తిడిచేయు; తదీయ చారిత్రముచే = వాని శీలాదులను వర్ణించుట చేత; అస్మదీయసంబంధ + అభిలాషులు = మా పుత్రికను వివాహమాడి నాతో వియ్యమందుటకు కోరిక గలవాడు.

పుట 24. ఉపాలంభించు = నిందించు; వర = శ్రేష్ఠమయిన (పెండ్లికొడుకునకు తగినట్టి యనికూడ); గుణ + ఆఢ్యులు = గుణములచే గొప్పవారు; వత్సరాజు-రాజదేవినుద్దేశించి వేసినప్రశ్నకదే సమయమున వత్సరాజు పట్టుబడెనన్నవార్తను చెప్పవచ్చిన కాంచుకీయుని వాక్యములోని మాట. కాబోవు సంబంధమును జమత్కారముగను సూచించుచున్నది—ఇట్టి నాటక చమత్కృతికి 'పతాకాస్థానకమని' పేరు. సముదాచారము (సం + ఉత్ + ఆచారము) —రాజులను సంబోధింపకుండ ఏవిషయమును చెప్పరాదు. త్వర = తొందర; ప్రియవచనమా? = రాజు తానువేశినప్రశ్నకు 'వత్సరాజు' కూతునకుతగిన వరుఁడని కాంచుకీయుడు చెప్పెననిభావించి ఈ విధముగా ప్రశ్నించుచున్నాడు; ఆకర్ణనము = వినుట; పరిహార్యరాలు = దూరముగా నుంపఁదగిన దానవు; సెలవు = ఆజ్ఞ (పరి)కారము)

పుట 25. శతానీకుని పుత్రుఁడని, సహస్రానీకుని మనుమని — కౌశాంబీపురాధీశుని, గాంధర్వవిద్యా (సంగీత) ధనునియని గ్రుచ్చి గ్రుచ్చి యడుగుటచే తన దేవికి వరుని గుణములు వ్యంగ్యముగా కవి చెప్పినట్లయినది. వాచ్యార్థము. పట్టుబడినది వత్సరాజని నిర్ధారణ చేసికొనుటయే. అట్లేని యౌగంధరాయణుడు కాలధర్మమొందెనా? —యౌగంధరాయణుడు బ్రదికియుండగా నింతటిపని జరిగినదా? యని తాత్పర్యము. అట్లేని వత్సరాజును బట్టుకొనలేము. యౌగంధరాయణుడు బ్రదికియుండగా వత్సరాజు శత్రువులచేత జిక్కుట యసంభవము కనుక నిందేదియో మోసముండి యుండవలెననిగాని, వార్త యబద్ధమనిగాని రాజు భావించుచున్నాడు.

యౌగంధరాయణుని బుద్ధిశక్తి శత్రువులకు సయితము నింతటి ఆశ్చర్యమును గొల్పినది.

(28 ప.) హస్తమ్న్య...... మందరపర్వతమును (కవ్వపుగొండ) మోయుటకు విష్ణువు కూర్మావతార మెత్తవలసివచ్చెనే అట్టికొండను చేతితో ఎంతటి బలవంతుడైనను త్రిప్పగలడా అని అసంభావ్యమగు నుదయగ్రహణమునకు దృష్టాంతము (అలంకారము) చెప్పుచున్నాడు రాజు. దర్పసమగ్రత = బలపరిపూర్ణతచే; ఉదగ్రపరాక్రమము = సాహసముతోగూడిన శౌర్యము; ఉగ్గడించు = పొగడు; తత్ + సచివరత్నముమంత్రము = ఆతనిమంత్రిశ్రేష్ఠుని యాలోచనాశక్తి; దబ్బఱ = అబద్ధము; ఆఁ, అవును— కొంతసేపటికిగాని రాజాశ్చర్యమునుండి తెప్పరిల్లలేదు.

పుట 26. జవ + అతిశయము = ఎక్కువవేగము; ఖరరథము = గాడిదల (కంచర) చే లాగబడురథము; కత్తళము = కవచము; లేమిన్ + చేసి = లేకపోవుటవలన; ప్రచ్ఛన్నముగా = మాఱువేసములతో; మహాసేనుండనైతిని—ఇన్నాళ్లును పేరునకే మహాసేనుడనుగాని, ఆ పేరిప్పుడు, యౌగంధరాయణుడు మంత్రిగాగల వత్సరాజు పట్టుబడినప్పుడు, సార్థకమైనదని భావము. ఇతని కొఱకే గదా—(మూలము 'ఏతన్నిమిత్తం కస్మా అపినదిత్సామో వాసవ

దత్తాం') ఇట్టివాఁడుండగా మఱియెవ్వరికిని మన వాసవదత్త నివ్వ వద్దు అని దేవి యభిప్రాయము. ఆంగ్లమున ననువదించిన Prof. Deodhar "Then! for his sake, we shall not give away Vasavadatta to any one"; భద్రద్వారము = మంగళద్వారము; వత్సరాజ ప్రధానంబుగా = వత్సరాజును ముందిడుకొని.

(29 ప.) ఉపమానము: శౌర్యశ్రుతపూర్వక = పరాక్రమముచే మున్నే వినఁబడినవాఁడు; క్రతుసంయుతము = యజ్ఞము గొఱకుద్దేశించినది; అంతఃస్థితరోషము = మనసులోనున్న క్రోధము కల; సింహములను యజ్ఞమున బలియిచ్చు నాచారముపూర్వము కలదో?

పుట 27. అభ్యుదయములు = మహత్త్వకారణములు; ప్రీతిభాజనము = సంతోషమునకు పాత్రమైనది; వేదాక్షరసమ్మిత... ప్రతిపాద్యము—భారతము పంచమవేద మగుటచేతగాని, భరత వంశమునందలి పురూరవుఁడు ఋగ్వేదసూత్రమున చేర్కొనబడుట చేతగాని; వయః + అనురూపము = వయస్సునకుతగిన; విస్రంభపాత్రునిగా = మదముచే విఱ్ఱవీగు వానినిగా; ఇందలి యిట్టివిందలో వంశము, రూపము విద్యాసంపద చెప్పినట్లు, దేవి కవియన్నియు గుణములుగా దోచుచున్నవి. ఆశ్చర్యము లేనిచోట (మూలము) 'అస్థానే విస్మితంసి' యని) తగని విషయమున మెచ్చుకొనుచున్నావని తాత్పర్యము.

పుట 28. (30 ప.) నిరంకుశముగా = అడ్డులేకుండా; గడ్డిపొద కంటుకొన్న యగ్నితో బోల్చుటచే మహాసేనుని ప్రతాపము అల్పులయెడలనేయనియు వెంటనేచల్లారిపోవుననియు తాత్పర్యము. భరతకుల + ఉపభుక్తము = భరత వంశమువారు క్రమముగా నుపయోగించినది; దర్శనీయము = అందమయినది; ఆ ఘోషవతి —మహాసేనుడు ఘోషవతిని గూర్చి మున్ను వినియుండుట మాత్రమే.

(31 ప.) నిసర్గరక్త...సునాద = సహజముగా నెఱ్ఱనివైన గోటికొనలచే మీటబడిన తంత్రులవల్లకలిగిన చక్కని ధ్వనికలది.

మంత్రవిద్య = వేద మంత్రములు; కైవసము = లోఁబడుట; కరుల మనసు — సంగీతముచే మదపుటేనుగలు కట్టుబడుట ప్రసిద్ధము.

ఇష్టానుభవంబుచే—శత్రువులనుండి రాబట్టినధనము అధిక సుఖమునుగూర్చును; హరి గాంధర్వద్వేషి = మనోహరమగు సంగీతమన్న ఇష్టములేనివాఁడు; వ్యాయామతోషి = దేహపరిశ్రమ యన్న సంతోషించువాఁడు; సార్థకము = ప్రయోజనము కలది.

పుట 29. ఉన్మత్తురాలు—వీణవాయించుట యన్న నంతప్రీతి యని గ్రహింపవలెను; అస్థాన...దోషము—సామాన్య దోషి శిక్ష కర్హుఁడుకాని యిట్టి మహారాజునకిట్టి శిక్షవిధింప దగదనుట; మహాఘాతుకుఁడు—అట్టి గొప్ప వత్సరాజునకుగల్గిన నిట్టి దీనస్థితిని జూచి యూరకుండువాఁడు ఘోరహత్య చేసినవానితో సమానము. ఆకారమునుబట్టియే—మహాపురుషులు, ముఖ్యముగా దీనస్థితియం దున్నప్పుడు, తమకిది కావలెనని, శత్రువులను వేడరుకదా! అతి క్రాంత...లు = గడిచిపోయిన యుద్ధవార్తలను; క్షుత + ఆదులు = తుమ్ము మొదలయినవి వచ్చినపుడు (ఎవరేని తుమ్మినపుడు 'చిరంజీవ' యనుట యిప్పటికినిమనయాచారము); కైవారము = సేవ

పుట 30. వీరమాని—నిజముగా వీరుఁడు కాకపోయినను వీరుడనని భావించు కొనువాఁడు (ఇట్లే పండితమాని మొ॥); మయూరయష్టిసౌధము—నెమళ్ళ నాట్యమునకై ఎత్తుగా నొక కఱ్ఱ పాతుదురు. అట్లే సన్నముగాను, ఎత్తుగాను నున్న మేడయని యర్థము చేసికోవలయును; ఎండ తగలకుండ — మహాసేనుని యౌదార్యము ప్రశంసనీయము. ఆతని కెంతమాత్రము నిష్టము లేదు. మంత్రులకు కష్టము దోచకుండ రాజు ప్రవర్తింపవలయును.

(33 ప.) వత్సరాజునెడల మహారాజు మనోభావములు. యుద్ధమున వైరభావము, విజయమున ఉదాసీనత్వమును (Neutrality) ఆతనికి గల్గిన శారీరక కష్టములకు పక్షపాతమును రాజుమనస్సు నీవిధముగా కాబోవు మంగళమునకై కవి సిద్ధపఱచు చున్నాఁడు.

## తృతీయాంకము

పుట 31. విదూషకుఁడు వెఱ్ఱిబిచ్చగాని వేసము వేసికొని; ఆమోదకమల్లకము = మిఠాయి యుండలను దాచుకొను పాత్రము (వత్సరాజు పట్టుబడెనను ధ్వని); దక్షిణామూషకంబులు = దక్షిణగా నిచ్చిన నాణెములు; అవలగ్నుఁడు = పిచ్చివాఁడు; నా వెంట నైననురాదు—వచ్చుటలేదే యనియర్థము, చాపలము = చిలిపితనము; వరాహహస్తి = తోలుతిత్తి (కొలిమింగొనిది); రోహితకాత్యాయని = ఎఱ్ఱని కాంతిగల (అసురసంహార క్రీడ చేయుటచే) పార్వతి.

పుట 32. యుక్తవర్ణత = తగినరంగులనుపూయుట; రథ్యా + ఉదకము = వీధినీరు; పేటు = దెబ్బ.

పుట 33. ఇతరుల వస్తువులనాసించి పట్టువడకుము — ఈ మాటలను ఉన్మత్తునితో చెప్పుటవలన వత్సరాజును బట్టికొనిన మహాసేనుడు పిచ్చిపని చేసినాడని వ్యంగ్యము. ఉన్మత్తుడుకూడ యౌగంధరాయణుడు ఏర్పరచిన చారులలో నొకడగుటచే వ్యంగ్యమును దెలుపు పాట పాడుచున్నాడు.

ఈపాటి = ఇంతశక్తిగలవారు; వివిధరూపములతో — చారులు వత్సరాజు జాడల నరయుటకై మాఱువేసములు వేయుదురు; ప్రత్యయమున = సహాయమున (ఇవి యున్నవిగదా యను నమ్మకముతో)

పుట 34. ఐరావతముతో తన్ను పోల్చుకొనుటయు, ఇంద్రుడు కాళ్ళకు త్రాళ్లుగట్టి బంధించుకొని పోఁబడెననియు తెల్పుటచే, వత్సరాజు పట్టుబడిన విధమును, తాను వత్సరాజు ననుచరుఁ డగుటయు మనకుఁ దెలియుచున్నవి.

ధారానిగళంబులగు—నీటిధారలనెడి గొలుసులుగలమెఱపులనెడి కొరడాలు—ఇంద్రునికి మేఘములు పరివారమని యభిప్రాయము.

బెడిదము = భయంకరమైనది; ఈహామాత్రకుఁడు = కోరినంతనే వచ్చినవాఁడు; శ్రమణకుడు = బౌద్ధభిక్షువు; ఏలదుఃఖించెదరు—ఇరువురుని చూచెను గనుక బహువచనము.

పుట 35. శ్రమణకుడు ధూ, ధూ యని ఉమ్మివేయుటలో యౌగంధరాయణుని యనుచరుడే యీ మాఱువేసమున మహాసేనుని నగరున ద్వారపాలకుడుగా ప్రవేశించి, రహస్యములు తెలిసికొని, తన యనుచరులకు గూఢముగా దెల్పుట.

నేనెదివఱకు — ఈశ్రమణుకునిలో పూర్వమునకును ఇప్పటికిని మార్పేమియు లేదు. తాను గుర్తించినాడన్నమాట.

కస్థూలికాఫేన పాండురము = ఉదయకాలపు మంచు, నుఱుగు వీనివలె తెల్లనైన; కల్లులడ్డువాలు—పులిపదార్థము వేసి పొంగించిన తియ్యనిరొట్టెలు; భయభయంబుగ = మిక్కిలి భయముతో; స్వస్తివాచనము—రాజునుగూర్చిన క్షేమవార్త వాకరికొకరు దెల్పుకొనుట; ప్రతిగ్రహము = దానముపట్టుట; ఉపాయనము = కానుక.

పుట 36. శాటి = వస్త్రము; అగ్నిగృహము—యౌగంధరాయణాదులు హోమాదు లయిపోయిన తర్వాత ఎవరును లేని ఒక హోమశాలలో ప్రవేశింతురు. పిచ్చివాడు—యౌగంధరాయణుడు; విదూషకుడు—వసంతుడు, శ్రమణకుడు—రుమణ్వంతుడను మంత్రి; తల్యపరిశ్రములరు — వత్సరాజును విడిపించుటకై ఒకే మాదిరిగా కష్టపడుచున్నవారు.

(34 ప.) అడలు = భయము; భావి + అశుభములు = రాబోవుకష్టములు; గతస్మరణమందె = జరిగిపోయినవానిని తలంచుకొన్నప్పుడే సుఖము.

సంకట — కష్టసమయములలో రాత్రివేళ మఱింత భయంకరముగాను దీర్ఘముగాను నుండి ఎంత సేపటికిని గడవదు; పదాత్రి = ఇచ్చునది (కలుగఁ జేయునది)

పుట 37. (35 ప.) అతి జాగరూకులై రహస్యములను బయట పెట్టక, ప్రజలయెడ ననురాగములేక, దోషములుగల్గిన శత్రువు లకు రాత్రి ప్రళయసమయమందలి రాత్రివంటిది. అనగా శత్రువు లట్టివారైనచో, వారికి నాశము తప్పదనుట.

ఏమఱక = మఱువక.

(36 ప.) మహీజాని—మహీ జాయగా గలవాడు రాజు (బహువ్రీహి); పటహజాలము = జేగంటలసమూహము; తిధిదేవ పూజలన్ = పర్వదినములయందు ఆయాదేవతలనారాధించు; మానుగ = ఒప్పునట్లుగా (ఈ పద మిచ్చట సార్థకమాయని సందేహము); నమః + చలితంబులు = వంగినవుడు మ్రోగినవి. నిత్య దైవపూజచేయునపుడు మ్రోగు జేగంటలబదులు వత్సరాజున కిపుడు కాలి సంకెళ్ళ చప్పుడగుచున్నదని భావము.

(2) మంతనము = మంత్రణము (ప్ర) = ఆలోచన; నలా గిరి—మహాసేనుని మదపుటేనుగు; కట్టుచోటులు = కొట్టములు; మేతపట్టు = మేతమేయుచోటు; ఓషధీకైతవము = మందులనెడి మిషతో.

పుట 38. కర్తవ్యమూఢము = ఏమిచేయవలయునో తోచనిది; అనుకూలపవనానుసారముగా = గాలివాటముగా; ఆయత్తము = సిద్ధము; ప్రతిగజమదము— వేఱొకఏనుగుమదమును బసిపట్టినచో నీయేనుగునకు రోషము అధికమగును; వారణము = ఏనుగు; అల్పసాధనయుతము = కొద్దిపాటిపరికరములతో నేర్పాటుచేసినది. నగారా— పెద్దధ్వనిచేసి ఏనుగునకు మతిపోగొట్టుట; ఆధ్వనిచే— ఏనుగుమదించి ఊరిపైబడినదనువార్తవిని.

(ప 37) తాత్పర్యము :

(1) వెంబడింపలేక శత్రుసేనలు ఏనుగు వెనుకభాగమును కేవలము వెంబడించిన ట్లూహించుకోవలసినంతగా, నతివేగ ముగా వత్సరాజు నలాగిరిని తోలుకొనిపోవునని భావము.

(2) వింధ్యారణ్యమందలి సింహములు వత్సరాజుధాటికి గర్జనలుసేయ మొదలిడి, ఆ గర్జధ్వని ఇంకను పూర్తిగాకమునుపే వత్సరాజు వింధ్యాటవిని అంత త్వరగా దాటిపోవునని భావము.

(3) ఒక్కనాటిలోనే మహాసేనుని చెఱనుండి స్వనగరమును చేరుకొను నంతటి వేగముగా నలాగిరిని పరువెత్తించును.

ముత్తెఱఁగు = మూఁడు + తెఱగులు—త్రివిధముగా

వ్యాక. (ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగును.) ముత్తెఱఁగనియు రూపము, మూఁడుశబ్దమునకు, 'డు' వర్ణలోపము, దీర్ఘమునకు హ్రస్వమును, మీఁది హల్లునకు ద్విత్వమును వికల్పముగా నగును.

పుట 39. స్వార్థపరాయణత — రాజు స్వలాభపరుఁడై మన ప్రయత్నమునకు తోడ్పడడేమోయనిశంక. అవహితులము—శ్రద్ధగలవారము; ధాత్రీ ద్వితీయయై - దాదితోడరాగా; కన్యాదర్శనంబు నిర్దోషంబు - పెండ్లికాని పడుచును పరాయివారు చూచినను తప్పులేదను నాచారము; + అర్ + ఆవృతము = కప్పబడనిది (open); అందలము = పల్లకి; అవఘట్టనంబుచే - నీరుపోవు భూమిలోని రాతితూము పగిలి పోవుటచే దారియంతయు బురదయైనదని పోవీలు లేదనియు మూలాను సారముగా భావము.

(మూ:- అవఘట్టిత ప్రణాలీప్రస్రుత సలిలవిషమం)

యక్షిణి—గ్రామదేవత; అభ్యంతర బంధనము = లోపలి కారాగారము; రాగలీలలర్ — అనురాగమువల్లకల్గినవిలాసములు.

పుట 40. కష్టములు - రుమణ్వంతునిదృష్టికి రాజు వాసవదత్తను ప్రేమించుట తమ యెత్తులకు బంధాకర మగును.

వృద్ధులము - యౌగంధరాయణుడు రాజేచేష్టలుచేసిన నవి యన్నియు తమ లాభమునకే యగునట్లు మార్చుకొను చున్నాడు.

శత్రుజన + అపహాస్యంబు = విరోధి పక్షమువారికి పరిహాసింప దగినది. దేశకాలములు—శత్రుపట్టణము; ఉపాయముచే తప్పించుకొని పోవలసిన కాలము.

(38 ప.) కర...అవని - సొంతచేతులతో పఱచుకోబడిన చాపచే కప్పబడిన నేల. (నేలమీద చాపవేసికొని పరుండుస్థితి); సస్మరుఁ = మన్మథుఁడుకలవాడు (అనురక్తుడు); చరణ + ఉత్ + అంచిత + శృంఖలారవము = కాళ్ళకు (తగిలించిన) పెద్ద సంకెలల ధ్వని రాజాయని హెచ్చరించునట్టి కాపలావారి సమూహము కారాగారమున నున్నారేకదా! కరము + ఆలించుచు = కాపలా వారి హెచ్చరింపు మాటలను వినుచు; శృంగార విషయములందు మనస్సుకలిగి చెదరని వారుండరని భావము బాధలలో నున్నపుడు.

పుట 41. వసంతకుఁడవు కదా - రాజు హితమును సదాకోరు నట్టివాడవు - ఇట్టి మాట పలుకదగునా యని ధ్వని.

(39 ప.) విని...మాట - స్నేహితుల మాటలనే ఆధారము చేసికొన్నవాడు - (సుహృజ్జనముపాశ్రిత్య); యుక్తకాలము - ఏసమయమున నేమి చేయవలయునో తెలియకున్నవాడు.

తా:- బాధలు పడుచున్న రాజును, మననే నమ్ముకొన్న వానిని విడిచిపోవుట న్యాయము కాదు. ఈరూపములతోనే మునలి వార మగుదము. పని నెఱవేరువరకు నెంతకాలము పట్టిననుసరే; మాఱువేసములతోనే యుందము. అంతటి యదృష్టమే పట్టినచో మూలము (తత్ నను శ్లాఘ్యం) అది మెచ్చుకోదగినమాట యని భావము. శుభము కోరువాడు చెప్పవలసిన మాటయని యర్థము. లోక మెఱింగినచో - మాఱువేసములతోనుండి స్వామినివిడిపించి, ఎవరు విడిపించిరో లోకమునకు తెలిసినపుడు కదా మనకు ప్రతిష్ఠ యని లోకము మెప్పును వాంఛించు సేవకుడు పలుకుచున్నాడు.

మనకు లోకముతో పనేమి!—స్వామిభక్తిగల మనకు లోకము మెప్పుతో బనిలేదు. నిస్వార్థముగానే మన కర్తవ్యము నెఱవేర్పవలయును. (ఈవాక్యము యౌగంధరాయణుని నిష్కామత్వమును దెల్పుచున్నది.)

ఉపక్రమించు = ప్రారంభించు; ఎప్పటి కింకదాని వేళ - విదూషకుని వేసములలోనున్న సేవకునికి ఓర్పుతక్కువ. ఎప్పటికి-

ఈసమాధానము యౌగంధరాయణుని తాల్మికి తార్కాణము.

(40 ప.) గాండీవధారియగు నర్జునుడు శత్రుపరాజయము చేసి కృష్ణుని సోదరియగు సుభద్రను హరించి తీసికొని పోయెను. పద్మవల్లరి...వోలె – మదగజము తటాకమునుండి పద్మలతను పెల్లగించినట్లు – బుద్ధిమంతుడగు యౌగంధరాయణుడు తన పరివారము చేసిన సూచనకు తన అంగీకారమునుదెల్పి ప్రతిజ్ఞ చేయునట్టివాడు కాని అహంకారముతో వారి సలహాను తిరస్కరింప లేదు.

పుట 42. ఎల్లి = రేపు (ఎల్లి + ఉండి = ఎల్లుండి – రేపుఆగి తర్వాత దినము అని అర్థము)

(ప్రియమైన వీణను, ప్రియతరమైనరాజును, రాజునకు ప్రియతమమైన వాసవదత్తను, వీరందరిని కొంపోవుటకు నళాగిరీయనెడి ఏనుగును రాజధానికి జేర్తునని భావము) కాదుకాదు—మన సంఘములోని వ్యక్తులు వేలువేలుచోట్ల నున్నను మన ప్రయత్నములన్నియు రాజును విడిపించుట యనెడి కార్యమునందేకోన్ముఖము కావలయును.

సంఘాతము = సమూహము; ఉన్మత్తుడు – లోకముకంటికి యౌగంధరాయణుడు పిచ్చివాడు.

ద్విపద— ప్రతిపంక్తికి 3 చంద్రగణములు, ఒక సూర్యగణము. 3 గణము మొదటి యక్షరము యతి మైత్రికి స్థానము. రెండేసి పాదములకు ప్రాసవలయును.

రాహువు మహాసేనుడనియు, దొంగతనముగా రాజునుపట్టెననియు, ప్రాణపదమగు రాజును విడిపింతుననియు ధ్వని.

అంగిలి + చీల్చి – గొంతు పగులదీసి – రాహుకంఠము ఇదివరకే తెగియున్నది.

పొంగకు = సంతోషపడకు; గరువము + తేజి = మదించిన గుఱ్ఱము; గగ్గోలు = పెద్ద హడావుడి.

పుట 43. పిచ్చసాగింతు = పిచ్చిమాటలను మఱల (లేదా, బిచ్చ – బిక్షము) ప్రారంభింతును. చిట్టినాయనలార – అల్పబుద్ధి

గలవారాయని వ్యంగ్యగర్భముగా పల్కుట; బాజాలు - ఇది హిందూస్తానీపదము. దీనిలో శకటరేఫ ఉండనక్కఱలేదు. ఈ వచనమంతయు ద్విపదలోని భావమే.

చతుర్థాంకము

44. వేసారిపోవుట = బాధపడుట; భద్రవతి = ఏనుగుపేరు; కండిలశౌండికి = త్రావి మదించియున్న కల్లమ్మునది;

ఎవడు + ఓసి + ఈడు = 'ఈడు' గ్రామ్యశబ్దము

[ఉత్తమ మధ్యమ పురుషలందు, ఏకవచన బహువచనములందు ఏను, ఏము, ఈవు, ఈరు అని రూపాంతరము లున్నవి. గాని, వీడునకు 'ఈడు' లేదు. వీరునకు 'ఈరు' లేదు]

రాదారి—'రాహ్' అనగా హిందుస్తానీభాషలో 'దారి' యని యర్థము. 'రాదారి' నిజముగా పునరుక్తి. కాని తెనుగున వాడుచున్నాము.

మోయన పిలుత్తాడు - 'మో' (బోరు) అను ధ్వనితో పిలుచును. గ్రామ్యశబ్దములు పాత్రోచితముల నిగ్రహింపవలెను.

త్రాగిత్రాగి-ఎంత త్రావినను తృప్తితీరదని ధ్వని.

జపాకుసుమము-'జపాపుష్పము'-ఎఱ్ఱనివి; యథా + ఉక్త + ఆకారము - పైని చెప్పిన ఆకారముతో, ప్రారంభమున హాస్యమునకై కల్లు వాని ప్రసంగము.

45. ఐతే + ఏమి-ఐతేమ్ - గ్రామ్యము; చూచిండు = చూచినాడు (తెలంగాణమున నీ మాండలికము గలదు)

దన్నాలు—ధన్యులు; వోళ్లే = వారలే; శాతనె = చేతనే; కైపు = మత్తు;వొళ్లను = ఒడలంతయు; అబ్బైనఇబ్బైన = బ్రతికినను చచ్చినను; బోగాలు = భోగములు, సుఖములు; యింటూ = వినుచు; కంటూ = కనుచు; కట్టాలు = కష్టములు, ఎమలోకం = యమలోకము.

46. ఆమెబొట్లు + ఎఱుగదు—రాజును ప్రేమించి విరహతాపము చెందుచున్నదని ధ్వని-అట్లే రాజు విషయమును, ఈడ = ఇక్కడ; గోపించ + ఒద్దూ 'వలదు' యని ప్రతిమాలుకొనుట; అసంబద్ధ ప్రలాపము = పనికిమాలిన ప్రేలుడు; కుది = తాకట్టు (Mortgage) స్వభావవినయ = నైజముచే నెమ్మదిగలది; దండ = (మెడలోని చంద్రవంకను బోలిన హారము మాలము 'క్షురప్రమాలా', Cresent necklet)

రాజకుమారి జలక్రీడకై బయలుదేరునపుడు (ఎవరేని రాజ వంశమువారు కదలునపుడు) ఏనుగును అలంకరించుట ఆచారము గదా? గంటయేమిటికి - రాజవీథులలో తిరుగబోదు గనుక - అట్లే కొరడాయును అక్కఱలేదు.

47. మొదలు + అంట(గ) + చెడకు - నీ వ్యాపారము మొదటికే మోసము తెచ్చుకొనకుము. త్రాగుము, త్రాగుము—తాగినవాడవుకనుకనే శత్రువగు వత్సరాజు శుభమును గోరుచున్నావనియర్థము - తగినట్టి తత్ + తత్ + ఉచితస్థానములు - ఆయా చోట్లు; సైగ = సంజ్ఞ ('సన్న' యని మఱియొక వికృతిరూపము) కల్లత్రాచులు (1) పగసాధించుటయందును, (2) పాముచెవులు గలవారనియు ధ్వని.

48. ప్రభువు ఉప్పుపులుసు తినునట్టి భటుడు యుద్ధసమయములో వెనుదీయరాదు. అట్లుచేసినవాడు నరకమునకు బోవును. యుద్ధమునకుపోవుటకు పూర్వము భటులకు హెచ్చరికగా, ప్రతిజ్ఞగా, చక్కని పాత్రను నీరుపోసి దర్భలచే పవిత్రముచేసి చేతికిత్తురు. అది చేతపుచ్చుకొనుట భటులకు సత్కారముగకూడ భావింపబడును. ఇది కౌటిల్యుడు అర్థశాస్త్రమున తేటపఱచినాడు. (X-3-68)

ప. 43. నిక్కలి పదనైనట్టియు, (స్వచ్ఛమయినట్టి) కావున మెఱయుచున్నట్టియు కత్తిధరించి, అంబరముల్ దాల్చి - మంత్రికి

వేషభూషలతో, పసిండి కేడెము = బంగారుఅంచులు
ంచి, తళ్కుమించు...నాళ్ = ప్రకటితుడగు చంద్రు
ఫు కాంతియుగల మేఘమువలె.

రౌతు = ఆశ్వికులు; బిట్టుగ = పూర్తిగా; సింధుర...
= ఏనుగుదంతముచే కొట్టబడిన చేయికలవాడై
గంధరాయణుని యుద్ధచాతుర్యము, పట్టుదల వర్ణితము.
స్థము రంగముపై చూపరాదు. (ప్రక్కనున్నవారిచే
లెను,) ఛీ = దుఃఖసూచకము; ప్రాకారతోరణం
యము వత్సరాజు పరివారమే. కోటగోడలు, సింహా
త్రము మహాసేనుని నగరముఅని తెలియజేయు

జదారిక = రాజకుమారి; పొడమిన = కలిగిన;
చిత్రభ్రమ; ఖడ్గద్వితీయుడు = కత్తియేసాయముగా
శౌహిణులు = బహుసంఖ్యగల సేన; ఆలంబు =
ంతావళము = ఏనుగు; ఖడ్గదోషము - కత్తిఎదుటి
తగలక శత్రువు ఏనుగుదంతమునకు తగిలి బద్దలగుట
దోషము = ప్రయత్నలోపము.
రతోరణంబులులేని కౌశాంబి - ద్వారప్రాకారములే
సేనాపరివారమంతయు ఎక్కువగా వత్సరాజుదేసుమా
ు.

శయనీయము - పలకవలెనున్న కొయ్యమంచము
స్వామి కార్యము నెఱవేరుటచే(stretcher) దిగులు
త్రురాజునకు చిక్కితిని. నిష్కళత్రులు = భార్యలేని
ాప్తకాములు = సిద్ధించినకోరికగలవారు; దైవవినిపా
దృష్టము సంభవించుట; అపశ్చాత్తాపకరంబు =
చారింపవలసిన కారణములేనిది; సంచితధర్ములు =
కూడబెట్టుకొన్నవారు; కాలధర్మంబు = మృత్యువు

భార్యాపుత్రులు లేనివారు అడవిని జేరి సుఖింతురు. కార్యసిద్ధి యైన తనుపరి అదృష్టము విషమించినను భయము లేదు. పుణ్యము చేసికొన్నవారు మరణమువచ్చినపుడు చింతింప నవసరము లేదు.

50. ప. 46 సమంబుగ = ఒక్కమాటుగా, ఒక్కవిధముగ; నయము = నీతి (రాజ); నీతితో, బాణములతో కార్యమునుచేసి రెండువస్తువులకు సహభావమును మనోహరముగా వర్ణించినచో సహోక్తి యలంకారము. తనవారి అపకీర్తిని శత్రురాజుల సంపదలనుపోగొట్టి—ఇదియు సహోక్తి యలంకారమే. జయమును, వత్సభూపతిని, కీర్తినిగాంచుట—దీపకాలంకారము.

ప. 47 యౌగంధరాయణుడే మాటలతో మంత్రి కార్యనిర్వహణమందలి కష్టమును దెలుపుచున్నాడు. వరలెడు = కలిగిన; అవారిగ = ఎడతెగక; దుర్భర = భరింపరాని; తిరముగునో = చెదరకఉండునో; తదీప్సితము = ఆకోరిక; ధీరతలేమి = ధైర్యము లేకపోవుటచే; వెసగా = శీఘ్రముగా.

ప. 48 పిచ్చివానికీ రూపము, పిచ్చివానికీ చేష్టలుతగునా యని ప్రజలు ఆశ్చర్యపడుదురని భావము. ఇది యెన్నటికిని జరుగబోదు. వత్సరాజును బట్టుకొనుట అసాధ్యమని, దురవస్థపాలైనప్పుడుకూడ బుద్ధిమంతుడగు యౌగంధరాయణుడు పలుకుచున్నాడు.

ప. 49. భద్రవతీత్వరగా = భద్రవతి వేగముగా పరుగెత్తుటచే (కళ్లెంగడిలో తాకట్టుపెట్టించుకొనుట యౌగంధరాయణుని ఎత్తుగడయే) దుస్సంధులు = దుర్మార్గులు; దవ్వుగా = దూరముగా (వెనుకపడునట్లు) త్రుటిగా = క్షణకాలములో; యోజనము = ఆమడ (నాల్గుక్రోసులు) గమించు = పోవు; బంధురకీర్తి = చక్కని కీర్తిగలవాడు.

51. స్వస్థచిత్తముతో—మత్తుమందులచేత నళాగిరి మతి తప్పియున్నది; శిక్ష = అభ్యాసము (Training) విరించి = బ్రహ్మ; ఆయుధీయులు = ఆయుధములుకలవారు; పరిహాస్యము = నవ్వదగినది.

ప. 51. జాగ్రతపడవలసినపుడువత్సరాజును బంధించి కొంపకు నిప్పంటించుకొనిరి. రత్నమేగిన పెట్టె — పట్టవలసినవాడు తప్పించుకొనిపోయిన కారాగారము.

ప. 52. కోపముతోనే బల్కిన గరువంపుమాటలు వాని మనస్సును ఎంతో కష్టపెట్టినవి. నాఎత్తునకు పై యెత్తు నడపుటకు సామర్థ్యము లేనివాడాతడు.

52. రాజనీతియందు చెప్పబడిన వాక్యములను సూక్ష్మదృష్టితో చూడనివాడు; విజయిక్ = జయించిననన్ను. ప్రతిక్రియా విరతిక్ = మాటెత్తులేని సమయమున.

ప. 53. పూర్వమే తనపని మోసముచే సాధించి, (చూడ శక్యముకానివాడై మారువేసము ధరించుటచేనని కూడ ధ్వని) రాజుకొరకు కష్టములుపడి, కాలముతప్పివచ్చిన యీ సమయమున నీ మహానుభావుడగు యౌగంధరాయణుడుమాత్రమందే కట్టువడి, త్రొక్కినపుడు తలమాత్రమెత్తు పామువలె నున్నాడు. అట్టివాని నేమని నిందింతును.

ప. 54. కపటనీలహస్తి — మోసముకొరకయిన నల్లని ఏనుగు; తద్విరోధము = ఆ (వంచనయనెడి)శత్రుభావము; ఎవో = ఏవో నిందావాక్యములు; నాకు = నాకోసము.

ఏక + అక్షర + ఆత్మికము = ఒకేఅక్షరము ('ఓ' అను) గలది; స్వరగాంభీర్యము = గంభీరమైన కంఠధ్వని - మహాత్ముల లక్షణము.

53. అశరీరంబులగు నక్షరములు — యౌగంధరాయణుడనుపేరేగాని వ్యక్తినిజూడలేదు.

ప. 55. వైర, సద్వ్రత + ఏక, నిష్ఠ = శత్రుత్వమును సాధించుటయనెడి వ్రతమునందె పూనికగల తండ్రియగు ద్రోణుని పరాభవించిన ధృష్టద్యుమ్నుని కూలిచి తృప్తిసెందె శాంతపడిన అశ్వత్థామవలె; గజవ్యాజంబున = మదించినఏనుగును వశపఱచు

కొనుటకు ఒక్క వత్సరాజే సమర్థుడని చెప్పి చెఱనుండి విడుపు పొంది, మోసము చేయుటచేత.

ప. 56. వరనాగము = శ్రేష్ఠమగుగజము; చెఱన్ = కారాగారమున; చేయి + దిండు = చేదిండు-(తలక్రింద చేయి పెట్టుకొని శయనించుటలో); రిత్తనేల = వట్టినేల; సెజ్జన్ + ఒనర్పించుటల్ = ప్రక్క గావించుట; మఱిన్యాయ్యంబులు = అవియన్నియు న్యాయమైనపనులా; త్వత్ + కృతంబు + అనుకరిపన్ = మీరు చేసినప్రకారం మే మేమును చేసితిమి.

ఆత్మజ = కూతురు; అదత్త + అపహారము = ఇవ్వని దానిని దొంగిలించుట; చోరవర్తనము = దొంగనడవడి.

ప. 57. భరతవంశమునబుట్టి వత్సరాజ్యమున కధిపతి యగు మహారాజు లేత వయసులోనున్న అందమైన రాకొమరితను మోహించి, వరించి, భార్యగా జేసికొన్నతర్వాత నే శిష్యురాలినిగా జేసికొనెను.

బంధమోచనసత్కారము...సమంజసమా — చెఱనుండి విడిచినపుడు కృతజ్ఞుడై యుండవలెను గాని, కూతు నపహరించుట తగునాయని వేఱొక్క దోష మారోపించుచున్నాడు.

54 (ప. 58.) నళాగిరి గజ శాస్త్రమును తెలిసినవారికే లొంగను కావున నది మా వత్సరాజు ఆజ్ఞప్రకారము వర్తించును. అందుచే తన్ను దారక్షించుకొనుటకును (స్నేహితుల ప్రాణములను కాపాడుటకును) మా రాజును మీ రాజు విడిచిపెట్టెను.

నా జ్ఞా సంప్రజ్ఞుడవయ్యేన్ — బంధమునన్న శత్రురాజు సంహరింపబడవచ్చునని తెలిసికూడ; సత్(—)తొంగను — కారగింప బడినవాడు; శరీరమంట లేదు—అపకారము చేయు లేదు.

ప. 59. లోకములో నెక్కడయినను సేనను సేనలు డాను గ్రహింతురు—అట్లే రాజునకు శిక్ష విధించెడు శత్రువు నెట్లు వశపఱచుకొనుట? జయము గొనుట?

ప. 60. తక్కు + పనులు = మిగిలినపనులు; పెద్దబ్రాహ్మణునే పడగొట్టిన వానికి (మహాసేనునే మోసగించి, వత్సరాజును విడిపించినవానికి) భరతరోహకాదులను ఓడించుట యేపాటి పని?

55. కినుక = కోపము; భృంగారము = సారాయపాత్రము (Chalice) దండ్యుఁడు = దండింపఁదగినవాడు; సౌధ + అగ్రసీమ = మేడ పైభాగమున; కురరి = కుందేటిపిల్ల; అనుకరించె = పోలును; శోక + అతిరేకము = దుఃఖాతిశయము; సంతప్తస్వాంత = సంతాపముచెందిన మనస్సుకలది.

56. ఇతఃపూర్వము = ఇంతకుముందే; నిర్వృత్తము = జరిగినది; ఫలకస్థితులు = చిత్రఫలకముపైనున్న (బొమ్మలోనున్న)

ప. 63. (సంతోషమును కప్పిపుచ్చుచు) ముఖములు కన్నీటిచే ఆవరింపబడి యుండగా, హఠాత్తుగా మంగళద్రవ్యములఁ గూర్చి, వివాహమంగళవిధులు స్త్రీలు ఆచరించుచున్నారు.

వ్యసనము = దుఃఖము; పరచక్రము = శత్రుసమూహము; చతుర్ + వార్ధిసహితమహీతలంబు = నాల్గుసముద్రములతో కూడిన (చుట్టబడిన భూమండలము)

---

# ANNOTATIONS

## ససందర్భము వ్యాఖ్యానించునది

---

ప్రథమాంకము

పుట

1. వత్సరాజాభిధానుఁడ వార్యశక్తిరాజితుండగు యౌగంధరాయణుండు.
1. బంధుకులంబున నేదోయస్వస్థత వాటిల్లినట్లు నేఁడుకలఁగంటిని
3. బలమెంతయున్న ననురాగము లేనియెడఁ గళత్రమా.

ప్ర థ మాం క ము

1. వత్సరాజాభిధానుఁడ వార్యశక్తి రాజితుండగు యౌగంధరాయణుండు. (పుట 1)

ఈపంక్తులు నాంది యనంతరము సూత్రధారుడు ప్రస్తా వించినవి. ఇది కుమారస్వామిని గూర్చిన స్తోత్రమును దెల్పుచు, నాటకమునవచ్చు పాత్రలను గూడ సూచించుచున్నది.

కుమారస్వామి పరముగా శివకుమారుడు, కుమారరాజు, శక్తిసమన్వితుడు మీకు శుభములు కలుగుజేయునని యర్థము. కథాపరముగా వత్సరాజును, మహాశక్తివంతుడగు యౌగంధరాయణ మంత్రియు మీకు శుభముల నిచ్చుగాక యని యర్థము. వేరే నాందీపద్యముకాక దేవతాస్తుతి పరమగు నీపద్యమును జదువుట యీ నాటకములోని విశేషము.

2. బంధుకులంబున నేదోయస్వస్థతవాటిల్లినట్లు నేఁడు కలఁగంటిని. (పుట 1)

సూత్రధారుడు నటిని పాట పాడుమని చెప్పినపుడు నటి యీ విధముగా సమాధానించినది.

తన చుట్టాల కెవరికో జబ్బు చేసినట్లు తనకు కలవచ్చిన దనియు, దానినిగూర్చి విచారించుచుంటి ననియు నా మెయనెను.

ప్రస్తావనలోని యీవాక్యము వత్సరాజు శత్రువులకు జిక్కె నని కథావస్తువును ధ్వనించుచున్నది.

3. బలమెంతయున్న ననురాగము లేనియెడ గళత్రమా. (పుట 3)

మహాసేనుడు మోసముచేసి వత్సరాజును బంధించెను. యుద్ధముచేసి జయింపలేదు. బుద్ధిమంతుడగు యౌగంధరాయణు డీవిషయమునుబట్టి యీవిధముగా నూహించుచున్నాడు.

మహాసేనునకు ఎంతో సేనగలదు. అయినను వారు తమ రాజునకు ప్రాణము నిచ్చువారు కారు. అందుచే ఎంత సేనయున్నను అది రాజభక్తి లేనిదగుచో 'అబలమే' యగును. స్త్రీయగు భార్య శారీరకముగా యుద్ధమునకు ఎట్లు సాయపడ లేదో అట్లే రాజభక్తిలేని సేనయు నని భావము.

4. జాగరూకునికంటెను విధియే బలవత్తరము. (పేజీ 6)

హంసకు డనువాడువచ్చి వత్సరాజు పట్టుబడిన విధమంతయు యౌగంధరాయణున కెఱిగించు చుండెను. వాని నోటివెంట మాట వచ్చీ రాకమునుపే యౌగంధరాయణుడు సంభావ్య విషయము చెప్పివేయుచుండగా హంసకుడిట్టి మేధాశాలియగు మంత్రి యున్నను, ఇట్టి యనర్థ ముప్పతిల్లిన దనును. దానికి మంత్రి చెప్పిన సమాధాన మిది.

ఎంత మెలకువతోఁ బురుషుఁడు ప్రవర్తించినను కానున్నది కాకమానదు. దైవ నిర్దేశము జరిగి తీరును.

ఈ వాక్యము వలన యౌగంధరాయణుని దైవవిశ్వాసము, వినయమునను విషయములు తేటపడుచున్నవి.

5. కాని రక్షణకశక్యంబు లగుటంజేసి దేశాంతరంబులు సన్నిహితానర్థంబులై యుండును. (పేజీ 7)

మంత్రితో హంసకుడు వత్సరాజు పట్టుబడిన విధముఁ జెప్పు సందర్భమునందలి విషయమిది. రుమణ్వంతుడను నమాత్యుడు వత్సరాజును వారించినాడట. "పరాయిదేశమున నున్న రాజునకు సరియగు రక్షయుండదు. కావున నెవరే నేదే నపకారము తలపెట్ట వచ్చును" అని నివేదించుచు వత్సరాజు ఒంటరిగా పోవుటను వారించినాడమాత్యుడు.

6. మాసంతాపాకృతియని నుడువుము. (పేజీ 8)

మహాసేనుడు వత్సరాజేనుగు వేటయం దభిలాష గలవాడని మాయయేనుగు నొకదానిని కల్పించి అందు సైనికులను దాగుకోఁబెట్టి, వత్సరాజు నాకర్షించి పట్టించెను. అట్టి యేనుగునుగూర్చి హంసకుడు మంత్రియగు యౌగంధరాయణునితో నది అలౌకికమగు ఏనుగనియు దానికి నాలుగు దంతములు కలవనియు జెప్పెను. అంత అది 'దివ్యవారణ ప్రతికృతి' కాదనియు తమ సంతాపామే ఆకారము ధరించి ఏన్గు రూపమున వచ్చినదో యనియు మంత్రి

ఉత్ప్రేక్షించు చున్నాడు. వత్సరాజును బంధించుటకు కారణమైన యా యేనుగు మంత్రి కంతటి ఉద్వేగము కలిగించినది. ఎంతటి స్వామిభక్తి కలవాడు మంత్రి!

7. తగిలించిరే మహా కఠినమతులు కంకణంబుల నిడుచోట సంకెలలను. (పేజీ 10)

వత్సరాజునుపట్టి సంకెలలతో బంధించిరనువార్త హంసకుని వలన విని యౌగంధరాయణుడు నిట్టూర్చు చున్నాడు. "రాజ భూషణములగు కంకణాదులు ధరింపవలసిన చేతులు సంకెళ్ళలో దగుల్కొన్నవా, ఎట్టి క్రూరకార్యము నొనరించిరి మహాసేన సైనికులు" అని మంత్రి తన దుఃఖమును ప్రకటించు చున్నాడు.

8. పాలితంబయి పుడమి తన్నేలు ధరణి పాలుఁ బాలింపుచుండు నాపదల యందు. (పేజీ 11)

వత్సరాజును పట్టి బంధించుటయే కాక మహాసేనుని సైనికు డొకడు చంపనుగూడబోయెను. కాని రక్తపుబురద నేలమీద కాళ్లు తడబడి వానికత్తికి వాడే బలియయ్యెను. ఈ మాట విన్న యౌగంధరాయణుడు సురక్షితమగు పుడమియే వత్సరాజును రక్షించినదని తన దైవవిశ్వాసమును ధర్మమందలి నమ్మకయును ప్రకటితము చేయుచున్నాడు.

9. దురవస్థ శత్రు సేనియు మిత్రకార్యంబునకుఁ బురికొల్పునుగదా! (పే.11)

మహాసేనుని సైనికులు వత్సరాజును పరాభవింపుచుండగా శాలంకాయనుడను మహాసేనామాత్యుడు మూర్ఛదేరి వత్సరాజు నకు నమస్కరించి రాజునకిట్టి అమర్యాద జరుగరాదని బంధనము లూడదీయించెను. అట్టివాని బుద్ధి వైభవమును మెచ్చుకొనుచు యౌగంధరాయణుడీ విధముగా బలుకుచున్నాడు.

పురుషుడు హీనస్థితిలో నున్నపుడు శత్రువునకు సయితము గుండెకరిగి మిత్రునట్లు ఆచరింప బుద్ధిపుట్టునుకదా. యని భావము.

10. స్నేహదుర్బలంబగు మాతృహృదయం బెట్లేని రక్షింపవలయును. (పే.13)

విజయయను ప్రతీహారిద్వారా యౌగంధరాయణుడు వత్సరాజు పట్టుబడినవార్తను రాజమాత కందజేయునపుడు విజయకు హెచ్చరికగా పలికినమాట యిది.

పుత్రప్రేమచే నిండిన తల్లిగుండె అతి సుకుమారముగా నుండును. ఒక్కమాటుగా వత్సరాజు బంధనవిషయమును దెల్పి రాజమాతకు పాటు కూర్పకుండ జాగ్రత్తగా ప్రవర్తించుము అని భావము.

11. ఈశోకంబగుంబో మంత్రుల ప్రాకల సామర్థ్యహైన్యపర వర్ణనము. (పేజీ 15)

వత్సరాజు పట్టువడిన వార్తవిని అంతఃపురస్త్రీ లేడ్తురు. అది విని యౌగంధరాయణు డిట్లనుకొనుచున్నాడు.

ఈఏడ్పున కర్థము స్త్రీల దుఃఖమేయైనను ఇందుమూలమున మంత్రులు చేతకానివారన్న విషయము అభిమానము గలవానికి గోచరించును. ఇంత గొప్ప మంత్రులుండియు రాజును రక్షించలేక పోయిరని ధ్వనించుటను గుర్తించి యౌగంధరాయణుడు తన కర్తవ్యమును సూక్ష్మబుద్ధితో నిరూపించుచున్నాడు.

12. కాదసాధ్యముత్సాహుల కేదికూడ. (పేజీ 18)

వత్సరాజును విడిపింప వలయునను ప్రతిజ్ఞచేసి యౌగంధరాయణుడు ప్రయత్నమున నుత్సాహము తోడుపడినచో ఎట్టి పని యైనను సాధ్యమగునని పల్కుచున్నాడు. కట్టెలు రాయిగా నిప్పు పుట్టునట్లును, భూమిని త్రవ్వగా నీరు పుట్టునట్లును సాధనమున పనులు సమకూరును ధరలోన నన్న లోకోక్తి ననుసరించి యీ వాక్యము మంత్రి మనోనిశ్చయమును దెల్పుచున్నది.

ద్వితీయాంకము

13. కన్యాదాన విషయంబున దైవమే సమర్థంబు. (పేజీ 19)

మహాసేనుడు తన కూతురగు వాసవదత్తకు వివాహము చేయగోరినవాడై ఎందరో రాజులవద్దనుండివచ్చు దూతలతో

మాట్లాడుచున్నను, ఏదేనొక నిశ్చయమునకు వచ్చుటలేదు. ఈ విషయమును గూర్చి తలపోయుచు కాంచుకేయు డిట్లనుకొనుచున్నాడు. పురుషకార మెంతయున్నను, దైవ మేర్పరచినవాడే వాసవదత్తకు వరుడు కాగలడని భావము.

14. తక్కు వైభవములమాట దానిదాని పాత్రిక్కృతంబగు సుకృతంబుఁ బట్టి యుండు. (పేజీ 21.)

మహాసేనుడు కాంచుకేయునితో వాసవదత్తకు తగినవరుని గురించి మాట్లాడుచుండును. అనేకసద్గుణము లేయొక్కనియందుండునో యట్టివాడు రాజునకిష్టము. సద్గుణములుగల వరుని వెదకి పెండ్లిచేయుటయే తండ్రి చేయగలడుగాని, తదుపరి కూతురుభాగ్యమామె పూర్వపుణ్యమునుబట్టి యుండునని దెల్పుచున్నాడు.

15. ఏమీ వాసవదత్తకు గాంధర్వమున నభిలాష జనించినదా? (పేజీ 22)

దేవివలన మహాసేనుడు కూతురు సంగీతము నేర్చుకొనుటకై పోయియున్నదని తెలిసికొని యిట్లనుచున్నాడు. తన కుమారులు సంగీత విద్యయందభిరుచి లేనివారగుటయు కూతురగు వాసవదత్త కభిలాష గాంధర్వవిద్య (సంగీతము) నందు కలుగుటయు రాజునకు సంతోషదాయకము. ఈ వాక్యమునకు అర్థాంతరము కలదు. అనుకోకుండ రాజీ విషయమును చదువరులకు స్ఫురింపజేయుచున్నాడు. మున్ముందు వత్సరాజునుజూచి వాసవదత్త మోహించునుగదా! గాంధర్వపరిణయమును వారిరువురకు జరుగునని మన మూహింపవలసి యున్నది. కవి చమత్కారముగా దీనిని సూచించినాడు.

16. భర్తయే వీణను నేర్పునులెమ్ము. (పేజీ 23)

దేవివచ్చి మహాసేనునితో వాసవదత్తకు వీణను నేర్పుటకు వేరే యాచార్యుడు కావలయునని దెల్పును. అంతట రాజిట్లనును.

కొలది కాలములోనే వాసవదత్తకు వివాహమగును కదా! వేఱే యాచార్యుని యవసరములేకుండ కాబోవుభర్తయే వీణ

నేర్పును లెమ్మని మాటవరుసగా నన్నాడు. కాని చదువరి ఇందలి చమత్కారమును గుర్తించును. కాఁబోవు భర్త వత్సరాజు వీణాగాన విశారదుఁడు. ఆయనకు వాసవదత్త సంగీతవిద్యలో శిష్యురాలగును. భాసు డిట్టి చమత్కారము లనేకములు చూపినాడు.

17. అట్లేని యౌగంధరాయణుడు కాలధర్మమొందెనా ? (పుట 25)

కాంచుకీయుడు వచ్చి మహాసేనునితో వత్సరాజు పట్టుబడిన సంగతి నిశ్చయముగా దెల్పును. రాజాశ్చర్యపడి మంత్రి యౌగంధరాయణుడు బ్రతికియుండగా వత్సరాజున కిట్టి యవస్థ కలుగుట అసంభవమను నమ్మకముతో నిట్లు పలుకుచున్నాడు.

యౌగంధరాయణు డేదేని కారణమువలన మరణించి యుండవలయును. లేనిచో వత్సరాజు పట్టుబడుట యబద్ధమని భావము. శత్రువులకు సైతము యౌగంధరాయణునిఁ గూర్చి యిట్టి యభిప్రాయమున్నది.

18. నేఁడుగదా మహాసేనుండనైతిని. (పుట 26)

మహాసేనుడు కాంచుకీయునివలన వత్సరాజు నిశ్చయముగ పట్టుబడెనని విని, నమ్మిక కుదిరి ఇఁక తాను సామంతులను నిర్భయముగా నుండవచ్చునని పలుకుచున్నాడు. వత్సరాజంతటివాడు పట్టుబడిన తర్వాత మహాసేనుడను పేరు సార్థకమైనట్లుగా భావించుకొనుచున్నాడు. చిక్కరాని శత్రువు చిక్కినపుడుగదా సేన గొప్పదియగుట. మహాసేనుడను పదమునకు వ్యుత్పత్తి గొప్ప సేన కలవాడని.

19. ఈఁత డేగుణంబుచే దోషియయ్యెను ? (పుట 26)

వత్సరాజెప్పుడును మహాసేనునివద్దకు వాసవదత్తను వివాహమాడదలచి దూతనైనను బంపలేదు. మహాసేనుడు దేవితో వత్సరాజెంతో గర్వియని పలుకుచున్నాడు. ఆతని వంశము, సంగీతవిద్య, రూపము, పౌరుల యనురాగము నాతనికి గర్వకారణము

లట. దేవికివన్నియు వరునకు తగిన గుణంబులే యనిపించినవి. ఇట్టి గుణములున్న వత్సరాజు దోషి కాడని దేవి యనుచున్నది.

20. ఇతరుల వస్తువుల నాసించి పట్టుపడకుము. (పేజీ 33)

వత్సరాజును విడిపింపవలెనని మారు వేసములతో యౌగంధరాయణుడును వాని యనుచరులును మహాసేనుని పట్టణములో దిరుగుచుందురు. వారి మాటలలో అర్థాంతరము మనకు స్ఫురింప జేయుట కవి ఉద్దేశ్యము. ఈ వాక్యము వత్సరాజు వయస్యుడగు వసంతుడు విదూషక వేషము ధరించి పలికినది. ఉన్మత్తుడు యౌగంధరాయణుడు తన లడ్డూలను అపహరించినట్లును, అందులకు వానికి శిక్షకలుగుననియు పైయర్థము. ఆశపడి వత్సరాజును బట్టిన మహాసేనునకు తగినశిక్ష పరాభవము నగునని వేరేయర్థము.

21. వివిధరూపములతో విలసిల్లు నివియో. (పేజీ 33)

పిచ్చివాని వేషమునన్న యౌగంధరాయణుడు తన వెఱ్ఱి పాటలలో విదూషకుని లడ్డూలు రకరకముల రూపములు ధరించి వానిని రక్షింపగలవని యర్థములేనివాక్యమును బలుకుచున్నాడు. తన కనుచరులైన సేవకులు మారు వేసములధరించి వత్సరాజును విడిపింప సాయపడగలరని అంతరార్థము.

22. ఇంద్రుడు పాదపాశికలచే బంధింపబడినాడట. (పేజీ 34)

ఇవి ఉన్మత్త వేషములోనున్న యౌగంధరాయణుని పలుకులు. అర్థాంతర సూచకములు. తానొక యైరావత గజమట. దేవరాజగు నింద్రుడు తనపై నెక్కినచో నాయనను మోచికొని పోగలడట. కాని ఇంద్రుడు ఏనుగుకాళ్ళకు గొలుసులు తగిలించు సేవకులచే బంధింపబడినాడట. అందుచే తాననుకొన్న పనికి విఘ్నము కలుగుచున్నదట.

ఇందలి యర్థాంతరము శత్రువులచే బంధింపబడియున్న వత్సరాజును తాను విడిపింతుననుట. ఇంద్రునితో సమానునిగా వత్సరాజునుగూర్చి చెప్పుటలో యౌగంధరాయణుని స్వామిభక్తియు,

పాదపాశికులతో శత్రుసేనను బోల్చుటచే వారి నీచత్వమును స్ఫురించుచున్నవి.

23. సంకట సమయంబులందు రాత్రియే యనర్థపరంపరాప్రదాత్రి. (పేజీ 36)

మారు వేసములతో శత్రుపట్టణమందు, ఆపదలనడుమ చరించు చున్న యౌగంధరాయణుడును, రుమణ్వంతుడు నిట్లనుకొను చున్నారు. రాత్రిగడచిన పగలెట్లు గడచునాయని, పగలెట్లో వెళ్ళుచ్చిన రాత్రిగడచుట యెట్లాయనియు వారిబాధ. అప్పుడు రుమణ్వంతు డిట్లనుచున్నాడు.

కాలమునందు రేవగళ్ళు సమభాగములయ్యును ఆపదలలో నున్నవారికి రాత్రి కష్టదాయకమని భావము. తమకేమి, శత్రువులకేమి, ఇదితథ్యమని యాతడనును.

24. కష్టము లెప్పుడును గట్టలు కట్టుకొనికదా వచ్చును. (పేజీ 40)

మారు వేసముననున్న వసంతక యౌగంధరాయణులు వత్స రాజు కారాగార స్థితినిగూర్చి తలపోయుచుండిరి. వార్తలు తెచ్చి వసంతకు డిట్లనును. రాకుమారి వాసవదత్త పల్లకి వత్సరాజున కారాగారము నెదుట నాగినపుడు వారు పరస్పరము చూచుకొ రనియు, వత్సరాజున కామెయెడల ననురాగము గలవాడగుట తాము మహాసేనునోడించి, వత్సరాజును విడిపించుట యనెడి కార్యము విఫలమగుననియు దెల్పును.

వత్సరాజు బంధింపబడుట యొకకష్టము. వాసవదత్త యెడ నాతడనురక్తుడగుట రెండవకష్టము. అందుచే కష్టములు కూడు కొని వచ్చినట్లు. ఈ రెండింటిని సమన్వయించి యౌగంధరాయ ణుని యుక్తి ప్రవర్తింపవలయును. అట్లే జరుగునని ముందు మనకు తెలియగలదు.

25. ఈ వేసములతోనే మనము వృద్ధులము గావలయును. [పేజీ 40]

వాసవదత్త యెడల ననురాగముగల రాజు తమ ప్రయత్న ములకు విరుద్ధముగా ప్రవర్తించుచున్న వాడగుటచే తామా ప్రయ

త్నము విరమింపుమన్న వసంతునిమాటను యౌగంధరాయణుడు వారించును. రాజును విడువదగదని గట్టిగా జెప్పును. అందులకు విదూషకుడగు వసంతకు డంగీకరించి తమకు ముసలితనము వచ్చు వరకు నైనసరే మారువేసములతోనే యుండి వత్సరాజును విడిపించు ప్రయత్నము మానరాదని ప్రతిజ్ఞ చేసినట్లుగా చెప్పును.

26. బంగారు మాచంద్రుఁ బట్టఁజూచెదవే,
దొంగరాహువ! నీకు దొరకనిచ్చెదనె? (పేజీ 42)

తనవారితో సంప్రదింపులై పిచ్చివాని వేషముననున్న యౌగంధరాయణు డనుచున్నాడు. పిచ్చివాని మాటలలో పైకి లోకోత్తరవస్తువులు వాచ్యములయినను, అంతరార్థము కథకు సంబంధించినదేయని గ్రహింపవలయు. తమరాజు చంద్రునివంటివాడు. మోసగించి యాతనిబట్టిన మహాసేనుడు రాహుగ్రహము. తాత్కాలికముగా రాహుగ్రహమునకు జిక్కినచంద్రుడు ఎట్లు తర్వాత విడుపొందునో అట్లే వత్సరాజును విడువడుట నిశ్చయమని యౌగంధరాయణుఁ డనుచున్నాడు.

చతుర్థాంకము

27. ఇది ప్రాకారతోరణంబులులేని కౌశాంబియేసుమా! (పేజీ 49)

యౌగంధరాయణుని యుక్తిమహిమవలన మహాసేన నగరము కౌశాంబియం దెచ్చటజూచినను వత్సరాజు సేవకులే. వాని సేనయే. ఇదిగని యాతనియత్నములు భగ్నము కావింపవలెనని మహాసేనుని సేవకులిర్వురు తమలో తమ్ము హెచ్చరిక చేసికొనుచున్నారు. ఇది పేరునకు మననగరము. చుట్టుగోడ బహిఃద్వారము మనవియే కాని యందలి జనములుమాత్రము వత్సరాజు సేవకులని భావము.

28. అపశ్చాత్తాపకరంబుగదా సంచితకర్మలకుఁ గాలధర్మంబు. (పేజీ 49)

శత్రువుల చేతినుండి వత్సరాజును విడిపించియు యౌగంధరాయణుడు దానుమాత్రము శత్రువులచేతఁ జిక్కినాడు. తన

ధర్మమును దాను నిర్వర్తించితి ననియు, ఇక తనకు మరణము సంభవించినను చింతింప నవసరము లేదనియు మంత్రి తనలో దా ననుకొనుచున్నాడు. రాజును విడిపించుట యనెడిది తన ధర్మము. శత్రువు తన్ను సంహరించునను నూహ తన్నిక బాధింపదు.

29. రత్నమేగిన పెట్టెకీ రక్షయేల? (పేజీ 51)

మహాసేన మంత్రియగు భరతరోహకుని యాజ్ఞవలన భటులు యౌగంధరాయణుని దెచ్చి ఆయుధపాణులగు వారిచే రక్షింపబడు కారాగారమున నుంచినపుడు యౌగంధరాయణు డీ మాటలనును. రత్నము పోయినతర్వాత పెట్టెను రక్షింపబూనినట్లు, వత్సరాజు తప్పించుకొనిపోయిన పిదప కారాగారమునకు రక్షయేల యని మంత్రి యాక్షేపణము.

30. త్వత్కృతం బనుకరింపఁగా మావి యన్యాయముల్. (పేజీ 53)

చేతజిక్కిన యౌగంధరాయణుని మోసముచే వత్సరాజున విడిపించుటయు నొక శౌర్యమేనా యన భరతరోహకు డధిక్షేపింపగా యౌగంధరాయణు డిట్లనుచున్నాడు. ఏనుగువేట యను మిషచే దొంగ ఏనుగుచే వత్సరాజును మీరు పట్టగా, మదపు టేన్గును వశబరచుకొన గలవాడు వత్సరాజని మేమాయనను విడిపించితిమి. మీరు చేసినపనియే మేమును జేసితిమి. ఇది అన్యాయ మెట్లగును?

31. కరివరముపైకి నెక్కకే కరణి ధరణి
వైజయంతిని గొనుటకు వలను పడును? (పేజీ 54)

భరతలోహకుని పోటుమాటలకు సమాధాన మొసంగుచు యౌగంధరాయణు డనుచున్నాడు.

ఏన్గుపై నెక్కి శత్రుజయమును సాధించినవాడు మా రాజు. ఇది లోకసామాన్యమే కదా!

వైజయింతిని గొనుటయనగా జెండాను వశపఱచుకొనుట, జయము సాధించుటయని యర్థము.

32. పెల్లగించితి మొదలంట పెద్దమ్రానె
చిన్నకొమ్మలఁ దునుములే చిక్కులుండె? (పేజీ 53)

ప్రాణములు దక్కవు సుమా యని భరతరోహకుడు యౌగంధరాయణుని బెదరించగా యౌగంధరాయణు డిట్లను చున్నాడు.

నాయంతటి వానిని బంధించుటయే సాధ్యమైనపుడు ఇతర కార్యక్రమ మొక లెక్కలోనిదా! చంపుట అతి సులభము అని భావము.

ఈ దృష్టాంతమున కవి యౌగంధరాయణుని పెనుమ్రానుతో నుపమించినాడు.

33. దండ్యునకు వలగాదు సత్కారమన్న. (పేజీ 55)

కాంచుకీయుడు వచ్చి భరతరోహకునితో రహస్యముగా నేదో చెప్పగా నాతడు యౌగంధరాయణునకు త్రాగుటకు భృంగార మొసగును. అదిచూచి యౌగంధరాయణు డిట్లనును.

మీరు నన్ను దండింపఁ దలచుకొన్నారు. కాని మీరీ భృంగారమును నాకిచ్చి గౌరవము చూపుచున్నారు. దండింతురని మనసులో నాకున్నపుడు మీరుచేయు గౌరవము నాకు రుచింపదు. చచ్చినచావుగా నుండును. దండింపఁ దగినవానిని సత్కరించుట చంపుటవంటిదే. కావున మీగౌరవము నాకు వలదని తిరస్కరించు చున్నాడు.

---

# పాత్రల గుణశీలాదికము

## యౌగంధరాయణుడు

యౌగంధరాయణుడే మన నాటకమున ప్రధానపాత్ర. అతని పేరటనే యీ నాటకము, అతని ప్రతిజ్ఞలు, అవి నెరవేరుటయే కథాభాగము. అతని శీలమును, నేర్పును, మహా

మేధావిత్వమును వెలయించుటకే యీ నాటకమును భాసుడు లిఖించినది.

యౌగంధరాయణుడు మూర్తీభవించిన స్వామిభక్తి. మహామంత్రి కది మొదటి లక్షణము. తన జీవితమంతయు రాజును రక్షించుటకే. రాజునకు కష్టము తన సంతాపాకృతియని చెప్పుకొన్నవాడు. రాజు పట్టువడెనన్నవార్త విని శత్రువగు మహాసేనుడుసయితము 'యౌగంధరాయణుడు బ్రతికియుండగనే' యని యాశ్చర్యపడినాడు. స్వామిభక్తియేగదా ఆతనిచే పిచ్చివేసము వేయించినది. రాజును విడిచిపెట్టువలెను వలసినచో నా వేసములతోనే ముసలివాడగుటకుకూడ నిశ్చయించినాడు. రాజభక్తియే ప్రాణములొడ్డియైన నతనిచే పోరించినది. శత్రువులకు జిక్కినపుడుకూడ మరణమునకేని వెనుదీయక నిర్భయముగా స్వామికార్యమును నెరవేర్చితినన్న సంతోషముతో నుండెను. ఆతని గుణమణిహారమున స్వామిభక్తి నాయకమణి.

రెండవది యౌగంధరాయణుని మేధావిత్వము. విషయగ్రహణమున సునిశితత్వము, ఉపాయాలోచనమున శీఘ్రత్వమును; నిశ్చితత్వమును ఆతని ధీగరిమకు ఫలములు.

రాజుగారు జీవించియేయున్నారని సేవకుడు చెప్పినప్పుడు ఆపద వాటిల్లెనని వెంటనే గ్రహించగలిగినాడు. ఉన్మత్తవేషమును బ్రాహ్మణుడొకడు విడిచివెళ్లెననగానే అవి తాను చేయవలసిన విధి కనుకూలములని వెంటనే గ్రహింపగలిగెను.

ఉపాయములు వెంటనే మదికి తట్టుట యౌగంధరాయణుని జన్మవిద్య. రాజమాతకు, రాజునకు రోజునకుకల్గిన కష్టము నొక్కమాటుగా నెఱుకపడనీయడు. మహావిజ్ఞానము నెఱిగినవాడగుట దీనికి కారణము. శత్రుగజముగా నళాగిరికి మత్తెక్కించుటలో ఎన్నెన్నిఉపాయములు పన్నినాడో! రాకుమారికకు రావలసిన భద్రవతి నేవిధముగా మాయముచేసినాడో! మాఱు

ఎందరు సేవకులను శత్రుపట్టణమున విహరింపజేసినాడో! రాజసేవకు కూడ ప్రవేశపెట్టగలిగెనో ఇవియన్నియు నాతని యాలోచనకును కార్యాచరణచణత్వమునకు తార్కాణములు.

కేవలము స్వామిభక్తియును బుద్ధిమంతుడును మాత్రమే గాక మహాపురుష లక్షణమగు వీరత్వము అతనియెడ కానవగును. పట్టుబడి యాయుధాగారముననున్నపుడు స్వరగాంభీర్యము శత్రువులనైతము ఆశ్చర్యపడ జేసినది. భరతరోహకుడు యౌగంధరాయణుని సాక్షాత్కారమున భాగ్యముగా భావించినాడు. ఒంటరిగా యుద్ధముచేసి తుదకు కత్తి జారిపోవుటచే పట్టువడినవాడు గాని ఒకమాత్రమున శత్రులకు స్వాధీనుడు కాడు. బుద్ధికి తగిన ఆత్మవిశ్వాసముకలవాడు. ప్రతిజ్ఞ లీగుణము ఫలమే.

ఇంకను ననేక విద్యలయం దారితేరినవాడు మహామంత్రి. ఓషధీవిద్య, గజశాస్త్రము మొదలగునవి తెలిసినవాడు.

ఇట్టి భారమును నిర్వహించి యౌగంధరాయణుడను పేరు సార్థకపఱచికొనియెను. కథలో నెక్కడజూచినను యౌగంధరాయణుడనుపేరు వినిపించుచునే యున్నది. కథామూర్తికి హృదయస్థానము, బుద్ధిమత్త, బుద్ధిమత్తను మించిన రాజభక్తి వానికడ యున్న వీరత్వమును యౌగంధరాయణుని సాహిత్యలోకమున నమరుని గావించివైచినవి.

## మహాసేనుడు

మహాసేనునంతటివాడే లేకుండిన యౌగంధరాయణుని కంతటిగొప్పతనము రాదు. మహాసేనుడెత్తిన యెత్తులు యౌగంధరాయణునినుండి పై యెత్తులు పుట్టించినవి. ఆ విధముగా యౌగంధరాయణుని బుద్ధికి పని కల్పించిన మహాసేను డెంతటివాడో తెలియవలయును.

మహాసేనుడు వాసవదత్త తండ్రి. వత్సరాజును బంధించుటకే అతని ఉద్యమము. వత్సరాజు పట్టుబడినప్పుడే నేడుగదా

నేను మహాసేనుండనైతి ననుకొన్నాడు. యౌగంధరాయణుడు బ్రతికియుండగా వత్సరాజు పట్టువడుట యింకను నాతనికి ముదావహము.

కాని చిక్కిన శత్రువును గౌరవించు నుదారలక్షణములు గలవాడీ మహాసేనుడు. ఎండతగులకుండ స్థలము మార్చవలెనని, అతిక్రాంతసమరప్రస్తావనలమూలమున శత్రురాజు మానసమును కష్టపెట్టరాదని, క్షతాదుల చికిత్స చేయింపవలెనని కాలానుగుణంబులగు కైవారములు చేయవలెనని వత్సరాజు విషయమున నౌదార్యమును జూపినవాడు.

శత్రువయినను, తనకు బందీయయినను వత్సరాజు వీరగుణములలో మహాసేనుడు వీరగుణములుచూచెను. వత్సరాజహంకరించుకొను భరతవంశము తగినదట. గాంధర్వవిద్య అభిలషణీయగుణమైనది. వయోనురూపంబగు సురూపము వలసినదే. దేవికూడ మహాసేనునిమాటల కంగీకరించినది. కాని సందేహించుచున్న సమయముననే వత్సరాజు వాసవదత్తతో పలాయితుడయ్యెను. ఇక విచారించి లాభములేదని మహాసేనుడు దేవినోదార్చి చిత్రఫలకముననున్న వాసవదత్తా వత్సభూపతులకు వివాహ మాచరించును.

ఇట్టి ఉదారవర్తనముగలవాడు కనుకనే మహాసేనుని శరీరమును యౌగంధరాయణుడు అంటలేదు. దీనికితోడు మహాసేనుడు ఉచితానుచితజ్ఞుడుకూడ. ఘోషవతియను వీణను కొమరులకివ్వలేదు. కారణములతోనే చెప్పినాడు. సంగీతమున్న నిష్టము కల వాసవదత్తకొసంగినాడు.

వాసవదత్త విషయమున నెంతయు ప్రీతికలవాడు. వీరాన్వేషణమున కెంతయో చూచినాడు. అతని ప్రతీక్షకు సత్ఫలము లభించినదని భావించుకొన్నాడు.

మహాసేనుడు వంచనముచే వత్సరాజును పట్టుట ఆతని వీరత్వమునకు లోపముగాదా యనునదొక ప్రశ్న. వత్సరాజు వాసవదత్తనపహరించుటలో మహాసేనుని వంచనమునకు ప్రతివంచనము సమాధానమైనది.

మహాసేనుడొక తండ్రిగా అగుపించునే కాని యుద్ధరంగమున కూరికిన వీరునివలె కన్పింపడు. భరతలోకమువంటి మంత్రి యౌగంధరాయణునితో స్పర్ధింపదలకొన్న వాడాతనికి అందయగుటచే మహాసేనుడు బలవంతుడయ్యెను.

మహాసేనుడు గుణజ్ఞుడగుటయే యాతని గుణము. మహాసేనుడే చేతజిక్కిన శత్రువులపట్ల నుతియొకవిధముగా ప్రవర్తించి యున్నచో కథకు వేఱురూపు వచ్చెడిదే. సత్కారమునకు సత్ఫలము లభించుటయందే దైవసత్పాలనము గోచరించుచున్నది.

---

## నాటకమునకీ నామ మెట్లు తగియున్నది?

ఈ నాటకమునకు ప్రతిజ్ఞాయౌగంధరాయణమని పేరు. ఇది కవిభాసుడు పెట్టినదే. ఇందు యౌగంధరాయణుని ప్రతిజ్ఞలు వర్ణితములు. వత్సరాజును విడిపించుటకు మహాసేనుని గజవిషయముననే వంచింతునని మొదటి ప్రతిజ్ఞ. వాసవదత్తతోకూడ వత్సరాజును కౌశాంబికి జేర్తునని రెండవ ప్రతిజ్ఞ. ఈ రెండు ప్రతిజ్ఞలలోను, అనగా ప్రతిజ్ఞలు పట్టుటకు యేర్పడిన పరిస్థితులలో ప్రతిజ్ఞలను నెరవేర్చిన పద్ధతిలో నాటకము విషయమంతయు వచ్చివేసినది. ఇక యీ పేరే ఎల సమంజసముగానున్నది. ఇతర నామ మీ నాటకమునకు పెట్టరాదాయున్న విషయములనుగూర్చి విచారింపవలసియున్నది.

మహాకవికి యౌగంధరాయణుని నేర్పును వెలయించుటే పర మోద్దేశ్యము. స్వామిభక్తి, బుద్ధినిపుణత కార్యాచరణచణత్వము,

మహామంత్రిత్వముయొక్క ఆదర్శమును ప్రపంచమెదుట పెట్టుటయే కవి యూహించెను. అందుచే నీ నామమును బెట్టియుండనోపును. భక్తిని ప్రకటించుకొనుటకు స్వామి యుండవలెను గదా! వత్సరాజు నాక్రమించిన కథ జరిగినది. కార్యాచరణమునకు రంగ మవసరముగదా. బుద్ధి నిపుణతకు ఆలోచనాశక్తికి, యుక్తికి చిక్కు పరిస్థితు లవసరముగదా! కాబట్టి వత్సరాజు బంధనము, మోక్షణము లవసరములైనవి. యౌగంధరాయణుడే కథాహృదయము నధిష్ఠించినది. వత్సరాజు యౌగంధరాయణుని హృదయము నధిష్ఠించిన దేవతామూర్తి కావచ్చును. భక్తుని చరిత్రను వర్ణించుచో భక్తుడే కథానాయకుడు. భక్తునికి భగవంతుడు నాయకుడగుగాక.

ప్రతి అంకమునను యౌగంధరాయణుని ప్రసక్తి వచ్చినది. రెండవ అంకముతప్ప మిగిలినవానిలో నాతడు ప్రత్యక్షముగా అగుపించును. పిచ్చివాని వేసములోనున్నను, అందు యౌగంధరాయణత్వమే ప్రేక్షకుడు చూచును. చదువరి యాలోచించును. పిచ్చివాడెంత బాగా నటించెనన్న మాటలో యౌగంధరాయణుడు పిచ్చివాడుగా నెంత చక్కగా నటించెనన్నదే ప్రధాన విషయము.

'వత్సరాజ'ను పేర మఱియొకరీ నాటకమును రచించిరి. వారు ఏ యుద్దేశ్యముతో నట్లు రచించిరో కాని, భాసుని యుద్దేశ్యముమాత్రము ఆతని 'గ్రంథనామమున' పూర్తిగ ఫలించినది. అద్దమున రత్నములు పొదుగవచ్చును. కాని యది అద్దమే కాని 'రత్నాభరణము' కాజాలదు. అట్లే యిదియును. మఱియు నింకను బంధకములు కలవు. వత్సరాజు వినిపించుటే కాని కనిపింపడు. నాయకుడు ప్రతియంకమునను రంగస్థలముపైకి రావలయునని లాక్షణికుల నిర్దేశము. కావున 'వత్సరాజు' అను పేరు తగిలేదు. మఱియును వత్సరాజుతానై ఘనకార్యము లీకథలో నొనరింపలేదు. పట్టుబడినాడు, విడిపింపబడినాడు. అదేమిగొప్ప

తనము. పైగా నాయకుని బంధించి పెట్టిన అపకీర్తిని మహాకవి తనమీఁదవైచుకొన నిచ్ఛగింపలేదు కాఁబోలు. కావుననే నాటకమునకీ పేరు పెట్టుట.

ఇంకొక్క ప్రశ్న. నాటకమున రసవిషయము అడ్డురాదా యని. ధీరోదాత్తుఁడో, ధీరలలితుఁడో యై నాయకుఁడైన వత్సరాజు బంధితుఁడగుటచే ఉదాత్తతను కనుబరచలేకపోయినాఁడు. శృంగారచేష్టలకు తగినంత సావకాశము లేకపోవుటచే నాటకమున ధీరుని లాలిత్యమును లేదు. ఇఁక రస మేమగును? యౌగంధరాయణునికి సంబంధించినదగును. అనగా? వీరాద్భుతములలో నొకటి కావచ్చును. వీరరసపోషకముగా అధికముగా యౌగంధరాయణుఁడు యుద్ధములలో పాల్గొనలేదు. అద్భుతమన్న సరిపోవును. ఎత్తునకు పైయెత్తులు, మారువేసములు, ఇవి యీయంశాను సమర్థించును. (రసమునుగూర్చి విశేషచర్చ జరుగలేదు.) కాబట్టి యౌగంధరాయణుఁడే భాసమహాకవి అనుకొన్న నాయకుఁడు. నాయకుఁడన్న పేరు లాక్షణికరీత్యా పనికిరాకున్నచో కథాప్రధాన పురుషుఁడనుఁడు. చిక్కేమి? వత్సరాజు నాయకుఁడుగా ఉద్దేశించలేదు కనుకనే మూలమునందున్న (బృహత్కథలో) సంగీతశిక్షణమును కవి తగ్గించి వేసినాఁడు. కేవలము సూచనగా జెప్పించినాఁడు. ఎన్నివిధములఁజూచినను అనగా, పాత్రపోషణము, రసము, ప్రత్యంకప్రత్యేకత, కథావస్తువు, యౌగంధరాయణుఁడే ప్రధానపురుషుఁడు. కావుననే నాటకమున కాతఁడు కావించిన ప్రతిజ్ఞలు, అవి పట్టుటకు వలసిన పరిస్థితులు. అవి నెరవేర్చిన విధములు కలిసివచ్చునట్లు 'ప్రతిజ్ఞాయౌగంధరాయణమని' భాసమహాకవి పేరు పెట్టినాఁడు.

వత్సరాజును, ఆతనియుదంతములును వర్ణించుటకు మఱొక నాటక మేర్పరచుకొనెను. అది స్వప్నవాసవదత్త ఉండనే ఉన్నది.

---

